# గా పెద్దన లీలా వైభవం

## డాక్టర్ పల్లా దుర్గయ్య



# పెద్దన కవితా వైభవం

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

అల్లసాని పెద్దన మనుచరిత్ర నుండి
ఎన్నికయిన పద్యాలకు మన్నికైన వ్యాఖ్యానం

రచన :
డా॥ పల్లా దుర్గయ్య

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి

5. కింగ్స్‌వే. సికిందరాబాదు-3

PEDDANA KAVITA VIBHAVAM
Poetic selections from
Allasani Peddana's Manucharitra.
By Dr. PALLA DURGAIAH


యువభారతి

**ప్రచురణ : 63**

**ప్రథమ ముద్రణ :**
రౌద్రి నామ సంవత్సర శ్రీరామనవమి
25 మార్చి 1980

**ప్రతులు : 1,200**

ముఖచిత్ర రచన :
**శీలా వీర్రాజు**

ముద్రణ :
**నాగలక్ష్మి ఆర్టు ప్రింటర్స్,**
హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ :
**గీతా ఆర్టు ప్రింటర్స్,**
హైదరాబాద్.

ప్రతులకు :

**యువభారతి**
5, కింగ్స్‌వే, సికిందరాబాద్-500 003.
లేదా
**యువభారతి కార్యాలయం,**
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు,
తిలక్‌రోడ్, హైదరాబాద్-500 001.

**వెల : రూ. 5/-**

---

Paper used for the printing of these books
was made available by the Government of India
at Concessional Rates
YUVABHARATHI IS GREATFUL.

# * యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలినపుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదహారేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 63 ప్రచురణలను ప్రచురించి మూడులక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే— యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు ప్రారంభించబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 6000 మంది సహృదయులుచేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 700 మంది, భారతీ భూషణులుగా 60 మంది చేశారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్ద్రం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాద్,
25–3–1980.
రౌద్రి-శ్రీరామ నవమి

అధ్యక్షులు, యువభారతి.

# మామాట

సాహిత్యాభిరుచి ఉన్న తెలుగువాళ్ళందరికీ పెద్దన మనుచరిత్రంతో పరిచయం ఉందని చెప్పినా, వెన్నెల హాయిగా ఉంటుందని చెప్పినా ఒక్కటే. సౌశీల్యానికీ, సౌందర్యానికి ప్రవరాఖ్యుడూ, అపురూపమైన అంచచందాలకూ కళావిలాసాలకూ శృంగారరసమూర్తి వరూధినీ తెలుగువాళ్ళ దైనందిన జీవితంలో అందమైన పదబంధాలుగా నిలిచిపోయినారు. మనుచరిత్రం చదువనిదే తెనుగు సాహిత్యాధ్యయనం పూర్తికాదు. అందరినీ తిట్టి వెక్కిరించిన కవి చౌడప్ప— "పెద్దనవలె కృతి సెప్పిన, పెద్దనవలె అల్పకవిని పెద్దనవలెనా" అని పెద్దనను పెద్దగా పొగిడినాడు. ఆంధ్రకవితా పితామహ బిరుదాంచితుడైన పెద్దన మనుచరిత్రం పదహారవ శతాబ్దంలో తెలుగు సాహితీసరస్సులో పూచిన శతపత్రం.

ప్రాచీన కావ్యాలలోని అందాలను వివరించి వాటిని చదువవలసిన అగత్యం మనకెందుకున్నదో తెలుపాలనే కుతూహలంతో ఇప్పటికీ సాహితీ వాహినీ పరంపరలో ఎన్నో చిరుపొత్తాలను ప్రచురించింది యువభారతి. ఈ 'పెద్దన కవితావైభవం' ఆ పరంపరలోనిదే. మనుచరిత్రంలోనుంచి కొన్ని అందమైన పద్యాలను ఏరి డా॥పల్లా దుర్గయ్యగారు వాటికి రుచిరమైన వ్యాఖ్యానం సమకూర్చారు. డా॥ దుర్గయ్యగారు విద్వత్కవులు. తెలుగు, ఉరుదూ, సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో చక్కని అభినివేశం సంపాదించినవారు. జ్యోతిర్వేదపారగులు. మధుర సంభాషణా చతురులు. పదహారవ శతాబ్దంలో తెలుగునాట విరిసిన ప్రబంధవాఙ్మయ వాటికలో విహరించి ఆ ప్రక్రియను గూర్చి ప్రామాణికమైన పరిశోధనచేసి పెద్దనను గూర్చిన అనేక అపూర్వ విషయాలను విద్వల్లోకానికి అందించి డా॥ దుర్గయ్యగారు ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి డాక్టరేటు పట్టాను పొందినవారు. సౌజన్యమూర్తులూ, స్నేహపాత్రులూ, ప్రతిభా వ్యుత్పత్తీ, అభ్యాసమూ మూర్తీభవించిన వ్యక్తిత్వంవారిది. పెద్దన కవితావైభవాన్ని మాకు వ్రాసియిచ్చి ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించిన డా॥ దుర్గయ్యగారి సౌహార్దానికీ సాహితీస్నేహానికీ మా కృతజ్ఞతా పూర్వకాభివందనములు.

పుస్తకానికి ముందుమాటను వ్రాసి మమ్ము ఆశీర్వదించిన మిత్రులు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారికి మా హార్దికాభివందనములు.

ముద్రణకు తెల్లకాగితం దొరకని ఈ గడ్డురోజులలో పుస్తక ముద్రణ కవసరమయిన తెల్లకాగితాన్ని సరసమయిన ధర కందించిన భారతప్రభుత్వము వారికి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పాఠ్యపుస్తక ముద్రణాలయాధిపతులకు మా కృతజ్ఞతలు.

ముఖచిత్రాన్ని ముచ్చటగా తీర్చిదిద్దిన ప్రముఖ కళాకారులు శ్రీ శీలా వీర్రాజుగారికి మా అభివందనాలు. పుస్తకాన్ని అందంగా ముద్రించి అందించిన శ్రీ నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ చిదంబరరావుగారికి, బ్లాకులను అందంగా తయారుచేసి సకాలంలో అందించిన శ్రీ అశోక్‌గారికి, ముఖచిత్రాన్ని అందంగా ముద్రించి అందించిన గీతా ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ బోస్ గారికి మా కృతజ్ఞతలు.

సమాజంలో సౌమనస్యాన్ని పెంపొందించడానికి సాహిత్యం ఉత్తమసాధనమని నమ్మి సాహిత్యోద్యమాన్ని నిర్వహిస్తున్న యువభారతికి భాషాభిమానులు ప్రోత్సాహాన్ని అందజేస్తుంటారని ఆశిస్తున్నాము.

శ్రీరామ నవమి,
25 మార్చి 1980

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు, యువభారతి.

# పెద్దన కవితకు నిలువుటద్దము

పెద్దన పేరు వినగానే ప్రబంధ యుగకవులందరిలో ఆ కవి పెద్దన వలయునని తెలుగువారి కనిపించును. తిక్కనకు 'కవిబ్రహ్మ' బిరుదము కలదు. పెద్దనకు 'ఆంధ్ర కవితా పితామహ' బిరుదము కలదు. తాత్పర్యమున నిద్దరును బ్రహ్మలే. పితామహులే. వారుచేసిన సృష్టివలన వారి కా బిరుదములు వచ్చినవి. వారి సృష్టి వారి రచనయందు, వారి కథాపాత్ర స్వభావములయందు; వారి కావ్య తాత్పర్యములందు వ్యాపించియున్నది. అది విశిష్టమైనది. అందువలన వారు బ్రహ్మలు. ఎవరి ప్రభావము మూడు తరములవరకు వ్యాపించినచో వారు పితా మహ శబ్దవాచ్యులు కావచ్చును. ఆంధ్ర సాహిత్యముపై వారి ప్రభావమట్లు ప్రస రించినది కావున వారు పితామహులే. 'కవి అల్లసాని పెద్దన, కవి తిక్కన సోమయాజి' అను ప్రశస్తి అట్లేర్పడినదియే.

స్వారోచిషమనుసంభవకథ పెద్దనగారి చతురరచనమున కనుకూలమైన దని శ్రీకృష్ణదేవరాయలు పేర్కొనెను. రాయలు పెద్దనను 'చతురవచోనిధి'యని ప్రశంసించెను. 'శిరీష కుసుమపేశల సుధామయోక్తుల' గృతి రచింపుమని కోరెను. ఆ సందర్భములందు రాయలు పెద్దనయొక్క ఉక్తిచాతుర్యమును కీర్తించెను. చతుర పేశల శబ్దములు సమానార్థకములు.'చతతే కాంక్షతే ప్రయో జనమితి చతురః'. 'పింశతి అవయవో భవతి కార్శ్యేషు ఇతి పేశలః' అని గురు బాల ప్రబోధిక. అనగా ఉద్దిష్టమైన ఒక పరమ ప్రయోజనమునకు సాధనభూతు డైన వాఁడు చతురుఁడు. అట్టి లక్షణము కలిగినది చతురవాక్కు. అట్టి వాక్కు చేత కవి సాధించునది రసము. 'సాధ్యోహిరసో యథాతథం కవిభిః' అని నన్నయ. రససిద్ధిని కాంక్షించి తత్సాధకముగా శబ్దమును ప్రయోగించుట చాతు ర్యము. చతురోక్తి రసాస్వాదన సాధువై యుండవలె ననినచో శిరీషకుసుమము వలెను, పేశలమును, సుధామధురమునై యుండవలెననియు,అది పెద్దన వాక్కు నకు సహజాలంకారమనియు రాయల హృదయము.

పెద్దనకుకూడ కవిత్వమునుగూర్చి యట్టి యభిప్రాయములేయున్నట్లు 'పూత మెఱుంగులన్' 'ఘనతర ఘూర్జరీ కుచయుగక్రియ'—అను అతని చాటు వులవలన తెలియుచున్నది. ఆ పద్యములలో చెప్పబడిన లక్షణములనన్నింటిని

క్రోడీకరించినచో నిష్టేర్పడును. కవిత్వము కాంతివంతమైన బిగువుగలిగి, సుగంధమువలె గుప్పున అర్థబోధ కలిగించి, హృదయతర్పణ మొనర్పవలెను. యువతీ వక్షోజములవలె నాతి కఠినములును, నాతి గూఢములునైన పదభావ బంధములు కలిగి, శ్రవణమాత్రముననే రమణీయార్థస్ఫూర్తిని కలిగించి, ప్రియురాలిని గూర్చిన విరహమువలె సంతతము ఆలోచనామృతమును వర్షించి, అధిక మనోజ్ఞమై చదివినకొలది చవులూరించుచు, చిత్తశాంతి కల్పింపవలెనని పెద్దన యాశయము. కావున ఆపాతమధురమును, ఆలోచనామృతమునునైన విశిష్ట పదరచనము కవిత్వమగునని పెద్దన యభిప్రాయము. అతడు తన ప్రబంధ రచనమున నేతల్లక్షణ లక్షితమైన ఒక వినూత్న శైలిని నిర్మించుకొనెను. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారన్నట్లు— "ఆడంబరములేని గాంభీర్యము, సౌమ్యమైన ప్రాభవము, ఉద్వేగములేని శీఘ్రగమనము, పేలవత్వములేని స్వాభావికత, వెలితి లేక నిండారి మెరుగులుతీరిన పదగుంఫనము" పెద్దన కావ్యశైలికి ముఖ్య లక్షణములు. దీనినే రాయలు మృదుమధురోక్తులతో కూడిన చతుర రచనమని కొనియాడినాడు.

పెద్దన వాక్కునకు సౌకుమార్య మాధుర్యములు సహజ గుణములు. శృంగార శాంతాది లలితరసములం దావాక్కు రక్తికట్టును. అతని జీవ తత్త్వమును రాయలు గుర్తించి స్వారోచిషమనుసంభవ కథను ప్రబంధవస్తువుగా నిర్దేశించి అది అతని చతురవాక్కున కనుకూలమని పేర్కొనెను. మనుచరిత్రమున శృంగార శాంతముల కధిక ప్రాధాన్యము కలదు. అద్భుతవీరాదుల కుపాంగ ప్రతిపత్తికలదు. అనంగసదృశుడైన ప్రవరుడును, విద్యుల్లతాంగియైన వరూధినియు, అంగనాసంగాభిలాషియైన గంధర్వ కుమారుడును, స్వరుచిప్రభా విరాజితుడును, దక్షిణ నాయకుడైన స్వారోచియు, విద్యావిలాస సుందరులైన మనోరమాదులును ఈ కథయందు ముఖ్యపాత్రములు. అయోగ విప్రలంభ సంభోగాభాస రూపములైన శృంగార రసభేదములు ఈ కథయందు సహజముగా భాసించు చున్నవి. తత్పాత్రల విలాస లలితవృత్తులు, తద్రసానుగుణ విభావాదివర్ణనలు గల యిట్టి ఇతివృత్తము పెద్దన వాగ్వృత్తికి అనుకూలమైనది మార్కండేయ పురాణాంతర్గతమైన ఉపాఖ్యానమును ప్రబంధేతి వృత్తముగా పెంపుచేయుటయు అతని చతురరచన కత్యంతానుకూలమే. 'ఆసాదిత చతుర్విధ కవితామతల్లిక' యైన పెద్దనకు విస్తర కవిత్వము వెలార్చుట కీ విస్తృత ప్రబంధమొక సదవ

కాసము కల్పించినది. అందువలననే పెద్దన ప్రబంధ గౌరవమంతయు అతడం దేమికథ చెప్పెనను దానికంటె, దానినెట్లు విస్తరించి చతురముగా చెప్పెనను దానిపైననే ఆధారపడియుండుట గమనింపదగినది.

మనుచరిత్రమునందలి కథ మూడు తరముల కథ. మనువు జన్మించి మనుస్థితిని సాధించుట ఫలము. పూరన మార్కండేయ పురాణమునందు— "స్వారోచిష జన్మంబును వర్తనంబుల్ స్వారోచిషాద్య ప్రభవంబువిన్నన్"— అని పేర్కొని కథను మూడు విభాగములుగా వింగడింపవచ్చునని సూచించెను. మొదటి భాగము: స్వరోచి జన్మమునకు హేతువైన కథాఘట్టము. రెండవభాగము: స్వరోచి వర్తనము వర్ణితమైన ఘట్టము. మూడవ భాగము : స్వారోచిషమను సంభవ వృత్తాంతము. ప్రథమ కథాభాగమునకు ఫలము స్వరోచిసృష్టి అతని వర్తన మాతని జీవసంస్కార చైతన్య ప్రవృత్తిరూపము. అట్టి సంస్కారములందు మాతాపితరులయొక్క తత్సృష్టి కాలమందలి జ్ఞానేచ్ఛాశక్తి చైతన్యయుతమైన అంతఃకరణము ప్రతిబింబించెననుట పూర్వభాగ కథ యందలి వస్తుధ్వని. సృష్టి ఇచ్ఛాధీనమైనది. అట్టి యిచ్ఛ గంధర్వునియందులేదు. వరూధిని యందు గూఢముగా కలదని కవి వ్యంజింపచేసెను. గంధర్వుడు వరూధిని హృదయము నాకర్షింపలేక మాయారూపమున నామెనుజేరి భోగించెను. ఆమెకు గంధర్వుని నిజరూపము తెలియదు. మాయావియైన అతడు సత్యస్వరూపసాధన మైన ఆమె దృష్టి నవరోధించెను. మోహాంధయగు వరూధిని అట్టి అంధ్యమున కొడబడెను. వారిరువురియందును బలీయమగు భోగేచ్ఛ మాయామోహితమై తదనుగుణ క్రియాశీలమును దాల్చెను. అది యట్లుండ వరూధినియందు భోగేచ్ఛ వెనుక గూఢమైన సృజనేచ్ఛ కలదు. దానివలన 'ధరణీదేవకుమారు' నాత్మ దలచినది. శమదమాన్వితమైన ప్రవరతేజోమూర్తిని స్మరించు వరూధినియందు జీవప్రేరితమైన జ్ఞానశక్తి గూఢమై భాసించినది. అనగా స్వరోచిసృష్టికి కారకులైన వరూధిని గంధర్వులయందు ఇచ్ఛాక్రియాశక్తులు మాయామోహ సమన్వితములై యుండుటచేత జ్ఞానశక్తి సంగుప్తమైపోయెనని తాత్పర్యము. అట్టి సంస్కార విశేషమే స్వరోచి చిత్తవృత్తియందు ప్రతిబింబించినట్లు చిత్రింపబడినది. స్వరోచి భోగైకలాలసుడై మనోరమా విభావరీ కళావతులతో క్రీడించుచున్నప్పుడు రథాంగవనితయు, హరిణీంద్రుడును, హరిణీ రూపిణియైన వనదేవతయు నాతని జ్ఞానవృత్తిని జ్ఞప్తికి తెచ్చినను అది జ్ఞాపితము కాకపోవుట తత్ఫ

లితమే. ఇట్టికథలో ప్రతీకాత్మక ప్రవృత్తిని భజించి వ్యాపించిన మహార్థము కలదు. పెద్దన దానిని రక్షించి పోషించెను.

గంధర్వ (మాయా) విముక్తయైన వరూథిని (ఇచ్ఛ) నిజ ప్రవరతేజో రూపమును (జ్ఞానమును) ఉపాసించుచు స్వరోచికి (తేజస్సుకు) జన్మనిచ్చెను. మాయా స్వరూపమగు మృగరూపమును వీడి దేవతారూపమును దాల్చి దైవ ప్రేరితయై మనుసృజనేచ్ఛా పరాధీనయైన వనదేవత స్వరోచియొక్క భోగ దృష్టిని హరించినది. అతడు మోహవిముక్తుడై (పరమ) హంస ప్రబోధమున స్వీయజ్ఞానశక్తిని తేజోవంతమొనర్చుకొనెను. స్వరోచియందలి ప్రవరతేజోదత్త మైన జ్ఞానవృత్తి మాయావిరహితమై సత్యజ్ఞానేచ్ఛా ప్రధానయైన వనదేవత కల్పించిన పాంచభౌతిక శరీరమునందు వసించి మనుశ్రేష్ఠునిగా స్వారోచిషుని సృజించినది.

ఈ కథలోని పాత్రములలో సర్వగుణోత్తరుడు ప్రవరుడు. అపూర్వ శృంగారమూర్తి వరూథిని. కపట కాముకుడు గంధర్వుడు. తేజోబలోదారుడును భోగైకశీలియు నైనవాడు స్వరోచి. స్నేహార్ద్రహృదయులు మనోరమా వభావరీ కళావతులు. దేవకార్య నిర్వహణదక్షురాలు వనదేవత. సర్వలక్షణ సమన్వితు డును, తేజస్వియు నైనవాడు స్వారోచిషుడు. జాతి సహజమైన మహిమా ప్రాగల్భ్యములు గలవాడు ఔషధసిద్ధుడు. గురువుల నపహసించిన గర్వి ఇందీవ రాక్షుడు. వీరిలో శుద్ధమైన చరిత్రము కలవారు ప్రవరుడు, స్వారోచిష మనువు. కథకు రెండంచులయందు నిలువబడిన బలమైన కంబములీరెండు పాత్రములు. వాని నాధారముగా నిర్మించిన నడిమివంతెన ఈ కథ.

మూడు తరముల కథను చిత్రించుట, వానిని ప్రతీకాత్మకములుగా పరి పోషించుచునే మానవ చిత్తవృత్తులనందు వ్యంజింపజేయుట, వర్ణనలయందు సమకాలీన వ్యవస్థను, పరిస్థితులను ప్రతిబింబింపజేయుట, కథలోపాటు రమణీ యార్థ ప్రతిపాదకమైన రచనను రమింపజేయు శిల్పమును వెలార్చుట, మొద లైన విశిష్టలక్షణములను ప్రబంధయుగ సాహిత్యమునకు పెద్దన ప్రసాదించి నాడు. పెద్దన ప్రబంధయుగ పితామహుడనిపించుకొనినాడు.

మనుచరిత్రమున వరూథినీ ప్రవరుల ఘట్టము తెలుగువారి హృదయము లను దోచుకొనిన ఘట్టము. పెద్దన ప్రబంధమున ప్రవరపాత్రను చదివిన పతిత– ఉప్పెనగా పొంగివచ్చు భోగేచ్ఛా ప్రవాహమునకు ఇంద్రియములను బిగ బట్టి ఎదురీది జ్ఞాన లక్ష్యమును సాధించిన ధీరశాంతుని విజయస్ఫూర్తిని మన

సార అనుభవించును. దానికి కారణము బలమైన, స్వయం సమగ్రమైన మాన సిక భౌతిక సంఘర్షణ మా ఘట్టమున సృషింపబడుటయే.

మనుచరిత్రమున ప్రవరుడు మేఘుడు, వరూధిని సస్యక్షేత్రము, గంధ ర్వుడు కర్షకుడు, స్వరోచి ఫలము. మేఘుడు వర్షించిన జలము భూమియందింకి కర్షకుడు చల్లిన బీజములలోని జీవాణువులను పోషించి సస్యాంకురములను మొలకెత్తింపజేయును. స్వరోచి జన్మమునకు ప్రవరుడు హేతుభూతుడు, వరూధిని మూలాధారము: గంధర్వుడు నిమిత్తమాత్రుడు. కావున వరూధినీ పాత్రమునకు మనుచరిత్రలో కీలకమైన స్థానముకలదు.

వరూధిని తత్త్వతః సౌందర్యోపాసకురాలు. భోగభూములలో ఆమెకు సమగ్ర సౌందర్యము లభ్యము కాలేదు. ఆధ్యాత్మిక తేజస్సంపన్నుడైన ప్రవరునియందామె సౌందర్య సమగ్రత్వమును దర్శించినది. ఉపాసింపవలసిన ఆ దివ్యసౌందర్యమును ఉపభోగింప నెంచినది. ఆమె కళాతపస్సు కళంకిత మైనది. అతీంద్రియమైన సౌందర్యోపాసనము ఇంద్రియవశుల కలభ్యమను తత్త్వమును పెద్దన కళాత్మకముగా వ్యాఖ్యానించినాడు. పవిత్ర దాంపత్య ధర్మమునందును, ధర్మపత్నీగతమైన రతియందును, ఏకవనితాగతమైన అను రక్తియందును శృంగారము రససిద్ధిని గాంచుననియు, లేనిచో అభాసు యగు ననియు పెద్దన ఈ ప్రబంధమున నిరూపించెను. శృంగారము శమదమ నియత మైనచో ధర్మరతి రూపమును దాల్చుననియు, అట్లుకానిచో కామమై జంతు ప్రాయమై కలుషితమగుననియు సమకాలమునకే కాక సర్వకాలములకును సార్థక మైన గేయమును పెద్దన ఈ కృతివలన తెలిపి సుకృతియైనాడు.

ఈ దృష్టితో ఈ ప్రబంధమును చదివినచో కామమునకును, రతికిని, ప్రేమమునకును భేదమంతగా తెలియని ఆధునిక జీవనప్రవృత్తికికూడ ఒక దివ్యోపదేశ మీ కావ్య మిచ్చుననుటలో విప్రతిపత్తి లేదు. యువభారతివారి ప్రచురణ ఆ ప్రయోజనమును సాధించినచో సార్థకము కాగలదు!

పెద్దనవలె డా॥ పల్లా దుర్గయ్యగారును చతురవచోనిధులు, పెద్దనపై ప్రత్యేకించి పరిశోధన చేసినవారు. ఆ కవి కళారహస్యములను కమనీయముగా నిందు వ్యాఖ్యానించినారు. పెద్దన కవిత కీ వ్యాఖ్యానము బంగారమునకు తావి కూర్చినట్లున్నది. పెద్దన కవితా వైభవమున కీ వ్యాఖ్యానము నిద్ధమైన నిలువు టద్దము.

రౌద్రి-శ్రీరామనవమి
25-3-1980

**డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు

# పెద్దన కవితావైభవము

అది పదునాఱవ శతాబ్ది మొదటి పాదము, రెండవ దశాబ్ది. ఆంధ్ర కవితా సరస్వతి ఆనాడు తన మూడవ చూలున గారాబుబిడ్డను, అందాల రాణిని ప్రబంధకన్యను మోయలేక మోయుచున్న నిండు ప్రొద్దుల చూలాలు. పురిటి పండుగ వైభవముగా జరిపించుకొన ముచ్చటపడి, విజయనగర సామ్రాజ్య ధురంధరుడు, సాహితీ సమరాంగణ సార్వభౌముడు నయిన శ్రీకృష్ణ దేవరాయల రాణివాసమున ప్రవేశించినది. అరివీరభయంకరుడును, కవిలోక శుభంకరుడు నైన శ్రీకృష్ణ దేవరాయలు ఒకనాడు

**ఇందీవరంబుల నీను క్రాల్గన్నుల**
**శరదిందు ముఖులు చామరము లిడఁగ**
**బణిపసూను కణాద బాదరాయణ సూత్ర**
**ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ**
**శార్వభూమి నభీరు భటకదంబ కరాళ**
**హేతిచ్ఛటిచ్ఛాయ లురులుకొనఁగ**
**సామంత మండనోద్దామ మాణిక్యాంశు**
**మండలం బొలసి యీరెండ గాయ**
**మూరురాయరగండపెండారమణిమ**
**రీచిరింఛోళిఁ గలయ నావృతము లగుచు**
**నంకపాళి నటద్దుకూలాంచలములు**
**చిత్ర మాంజిష్ఠవిభ్రమశ్రీ వహింప.**

'భువన విజయ' మను సభా భవనము నందలి సింహాసనము మీద గూర్చుండి కవి పండితులతో గొలువుదీఱి యుండెను. పై పద్యములో పెద్దనగారు

రాయలవారు కొలువుదీరుకీతిని, తద్వైభవమును పర్ణించినారు. 'మూరు రాయర గండ పెండార' మను బిరుదుకడియమును డాకాల ధరించి, రాజోచిత వస్త్రాభరణములతో సింహాసనమున గూర్చుండి యుండెను. దాని కిరు వైపులను చామరగ్రాహిణులగు చంద్రముఖు లిరువురు, కన్నుల నుండి నల్ల కలువలను గ్రుమ్మరించుచు వింజామరములు వీచుచుండిరి. రాజున కిరు ప్రక్కలను సాహసికులయిన భటులు విచ్చుకత్తులు చేతుల ధరించి యుండి వాని నల్లనికాంతులచే చీకట్లు గ్రమ్మించుచుండిరి. వేరొకచోట తర్క వ్యాకరణ వేదాంతాది శాస్త్ర విద్వాంసులు ఉపన్యాస ప్రసంగములు జరుపుచుండిరి. రాజు నెదుట నొక్క ప్రక్క సామంతరాజు లాసీనులయి యుండిరి. వారు ధరించిన నానావిధ రత్నాభరణముల కాంతు లంతట గ్రమ్ముకొనగా లేయెండ గాయుచున్నట్లుండెను. వింజామరల గాలికి రాయలవారు ధరించిన సన్నని చలువ వలువల యంచులు కదలాడుచుండెను, ఆయన డాకాలి గండ పెండారమునందలి మణుల కాంతులు ప్రసరింపగా, ఆయన వస్త్రములు ఎఱుపు పసుపు కలిసిన చిత్ర వర్ణములతో వింత గొలుపుచుండెను.

స్త్రీల కన్నులను నల్లకలువలతోడను, లోహనిర్మితము లయిన ఖడ్గములను నల్లని చీకట్లతోడను పోల్చుట కవి సంప్రదాయము. నానా విధములయిన మణులు మాణిక్యము లొక్కచో గూడిన, ఇంద్ర ధనుస్సు వంటి రంగులను కలిగించుట సహజము. చామర గ్రాహిణులు 'శరదిందుముఖు' లనుటచే వారి ముఖములు వెన్నెలలను, వారి కలువ కన్నులును భటులచేతి విచ్చుకత్తులు చీకట్లను, సామంతరాజుల రత్నాభరణములకాంతులు లేయెండలను, మరియు, రాయల గండపెండారపు మణుల కాంతులు చిత్రమైన ఎఱుపు పసుపు రంగులను సభాభవనము నంతటను ఏకకాలమున ప్రసరింపజేయుచు విచిత్రమును గలిగించుచుండును. వెన్నెల, చీకటి, ఈరెండ అనునవి ఒకేకాలమునం దుండుట ప్రపంచానుభవమునందు అసంభవము, అసంగతము, అయినను కావ్య ప్రపంచమునందు ఇట్టియద్భుతము కవిశక్తిచేత సంభవమగుచుండును. వింజామరముల గాలికి దుకూలముల అంచులు నటించుట, మణుల కాంతులచే ధవళ దుకూలములు చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీవహించుట అనునవి కుశాగ్రబుద్ధుల ఊహలకు మాత్రమే స్ఫురించు విషయములు. రాయలవారి కొలువు కూటము నందు తాను గూర్చుండి యుండి, చూచిన ప్రత్యక్షానుభవముతో పెద్దన ఈ పద్య

మును రచించినాడనుట నిజము. కృష్ణరాయల సభాభవన వైభవముతోపాటు కవి యిందు తన కవితా వైభవమునుగూడ కొంత ప్రదర్శించినాడు. సభలో విద్వాంసు లుపన్యసించుటచే రాయలవారి కవిపండిత పోషణము, విద్యాప్రీతియు దెలుపబడినవి. ఈ పద్యము మూడవపాదమునందు పెద్దనగారు 'పార్శ్వభూమి, నభీరు భటకదంబ కరాళ, హేతిచ్ఛటచ్ఛాయ' లనుట యందు భకార, కకార, ద్విత్వచ్ఛకారమును,- మరియు గీత పాదము నందు, మూరు రాయల గండ పెండార మణి మరీచి రింఛోళి' అనుట యందు 'ర' వర్ణ, బిందు పూర్వక 'డ' వర్ణ, 'మ' వర్ణములను పునరావృత్తము చేసి, ఛేకాను ప్రాస వృత్త్యానుప్రాసములచే నొక విధమయిన శ్రవణ సుఖమును పాఠకులకు కలిగించినాడు. ఈ శబ్దములు చెవి సోకినంతనే హాయి గొలిపి, పునః పఠనమునకు ప్రేరేంపించును. పెద్దన కావ్యములో నిట్టి రచనాశిల్పము పెక్కుచోట్ల అప్రయత్నఘటితమై (ఆలోచనామృతముతోపాటు) సంగీతము వలె ఆపాత మాధుర్యము నావాదించుచుండును.

కృష్ణరాయలు అశ్వపతి, గజపతి, నరపతు లను ముప్వురు రాజులను జయించి డాకాల గండెపెండేరమును ధరించినట్లే, సంస్కృతాంధ్ర తమిళ కర్ణాటకాది బహుభాషా కవి పండితులతో నిండిన కొలువు కూటము నందు, రాయలు కోరగా ఆశువుగా సంస్కృతాంధ్ర భాషలలో సమాన సామర్థ్య సారస్యవంతముగా , 29 చరణములు గల పూతమెఱుంగులున్, అను ఉత్పల పద్యమాలికను 'త' ప్రాసముతో ఏకధాటిగా చెప్పి మెప్పించినాడట! ఆ పూర్తి పద్యమాలిక ఇట నుదాహరింపబడుచున్నది.

**2**

'పూత మెఱుంగులుం బసరు పూపబెడంగులు జూపునట్టివా
కైతలు? జిగ్గు నిగ్గు నెనగావలె, గమ్మన గ్రమ్మన న్వలెఁ
రాతిరియుం బవల్ మఱుపురాని హొయల్ చెలియారజంపు ని
ద్దాతరి తీపులంబలెను దారసిలన్వలె లోఁదలంచినన్
బాఁతిగఁ బైకొన న్వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ

కూఁత లనన్వలెన్, సొగసు కోర్కులు రావలె నాలకించినఁ,
జేఁతికొలందిఁ గౌఁగిటను జేర్పఁగఁ గన్నియ చిన్నిపొన్ని మే
ల్మూఁతల చన్నుదోయివలె ముచ్చట గావలెఁ బట్టిచూచినఁ,
డాతొడ నున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ
కమ్మనౌ
వాతెఱదొండపండువలె వాచవి గావలెఁ బంటఁ నూదినఁ,
గాతలఁ దమ్మిచూలిదొరకై పసపుంజవరాలి సిబ్బెపు
న్మెతెలియబ్బురంపు జిగి నిబ్బర పుబ్బగు గబ్బిగుబ్బపాం
బూఁతల సన్న కాయ సరిఁబోఁడిమి కిన్నెర మెట్లబంతి సం
గాతపు సన్నబంతిబయు కారపుఁ గన్నడ గౌళపంతుకా
సాతత తానతానలపసం దివుటాడెడు గోట మీటు బల్
ప్రమోఁతలునుం బలెన్ హరువు మొల్లము గావలె
నచ్చతెన్గు లీ
రీతిగ; సంస్కృతంబు పచరించిన పట్టున, భారతీ వధూ
టీతపనీయ గర్భనికటీభవదానవపర్వ సాహితీ
భౌతిక నాటకప్రకర భారతభారత పమ్మతప్రభా
పాత సుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమ ఘుంఘు
మార్భటీ
జాతకతాళయుగ్మ లయసంగతి చుంచువిపంచికా మృదం
గాతత తేహిత త్తహితహోధిత దంధణుధాణుధింధిమి
వ్రాత నయానుకూల పదవార కుహూద్వహ హారికింకిణీ
నూతన ఘల్ఘలాచరణ నూపురఝూళఝుళీమరంద సం
పాత వియద్ధునీ చకచక ద్వికచోత్పల సారసంగ్రహో
యాతకుమార గంధవహహారి సుగంధ విలాసయుక్తమై
చేతముఁ జల్లచేయవలెఁ జిల్లునఁ జల్లవలెన్ మనోహర
ద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయస ప్రసా
రాతిరస ప్రసాదరుచిర ప్రసరంబుగ సారెసారెకున్."

ఈ ఆశుపద్యమాలికలోని మొదటి సగమును తెనుగు శైలిలోను, తర్వాతి సగము దీర్ఘ సమాస ఘటితమైన సంస్కృత శైలియందును ఆశువుగను అపూర్వముగను చెప్పి, సభాసదుల నానందాశ్చర్యములలో ముంచెత్తినాడు. ఆనందమును పట్టలేక రాయలవారు పెద్దన నాలింగనము చేసికొన 'బిరుదైన కవిగండపెండేరమున కీవె తగుదని తానె పాదమున'( దొడిగి బహూకరించి నాడట! 'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమః' అని కదా పెద్దల వానుడి!

ఈ ఆశువులో పెద్దనకవి కవిత్వమును గూర్చిన తన యభిప్రాయమును సంస్కృతాంధ్ర శైలులలో సోదాహరణముగా ప్రదర్శించినాడు. ఈ ఆశు పద్యము పెద్దనగారి మనుచరిత్ర కావ్య కవితకు మచ్చుతునకవలె నున్నది. ఇందలి సంస్కృత విభాగమునందలి, 'తాళ లయ సంగతి, విపంచికామృదంగా తత...ధింధిమి వ్రాతనయానుకూల పదవారము, కింకిణీ నూతన ఘల్లు లాచ రణ నూపుర ఝాళంఝుళంఝుళలు, వికచోత్పలసారసంగ్రహాయాత కుమార గంధవహ హారి సుగంధవిలాసములు మనుచరిత్ర కావ్యవీథులలో విహరించు సహృదయ పాఠకుల శ్రవణ ఘ్రాణేంద్రియములకు సంతర్పణము చేయుచుండు ననుట అనుభవసిద్ధమే. అట్లే పెద్దనగారి శిరీషకుసుమపేశల సుధామయోక్తు లును, ఇందలి గోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయసరస ప్రసారరుచిరములై పాఠకమహాశయుల హృదయ రసనలను రసార్ద్రము లొనరించి తనియించు చుండుట కూడ సువిదితమే. ఆంధ్ర కవితాపితామహుని ఆశుకవనమే ఇట్లుండగా ఆలోచించి రచించిన మనుచరిత్రమునందలి 'చతుర రచన' ఇట్లుండు నని చెప్ప పనిలేదు.

సంస్కృతాంధ్రములందు సమముగా కవిత చెప్పనేర్చినవారే, గండ పెండేర గౌరవమునకు అర్హులని రాయలు ప్రకటించినపుడు, సభలోని ఇతర కవులవలెనే పెద్దనకూడ మిన్నకుండినాడు. కాని

> 'ముద్దుగ గండపెండియరమున్ గొనుడంచు బహూకరింప(గా
> నొద్దిక నా కొసంగు మని యొక్కరు( గోర(గలారు లేరొకో ?'

ఈ సభలో కవులు ఒక్కరును లేరా ? అని రాయలు గద్దించి యడిగి నపుడు పెద్దన

'పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే
పెద్దన కీఁదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా' !

అని పూరించి 'ఇదిగో నేనున్నా' నని లేచి నిలువబడినాడు. గండపెండెరము (న్)' అను మాట యందలి ఏడు అక్షరములకు ఏడు ఉత్పల పద్యములను, మరియు 'ౝ' నకారపు పొల్లునకు ఒకపాదము లెక్కన మొత్తము 29 పంక్తుల పద్యమాలికను ఆశువుగా ఆవేశముతో జెప్పినాడు. కాని వేఱొక సమయమున రాయలవారు పెద్దన నొక కృతి చెప్పుమనగా పెద్దనామాత్యుడు

**3**

**"నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క**
**ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పుత**
**ప్పరయు రసజ్ఞు లూహఁ దెలియంగల లేఖకపాఠకోత్తముల్**
**దొరకినఁగాని యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే?**

అను నొక చాటువు చెప్పినట్లు పూర్వమునుండియు ప్రసిద్ధి. కాని ఇట్టి పదభావములతోగూడిన కన్నడపద్య మొకటి, పెద్దనకు ఛాల పూర్వమున బుట్టిన కన్నడగ్రంథమునం దున్నట్లు తెలియుచున్నది. కన్నడపద్య మెవరిదైనను పై తెలుగు పద్యము మాత్రము పెద్దనగారిదే. ఆ కన్నడ పద్యము స్ఫురణకు వచ్చి పెద్దన ఈ తెలుగుపద్యమును చెప్పియుండవచ్చును. ఇచ్చట ఒక విషయము.

ప్రబంధ కవితకు పెద్దన ఎట్టివాడో అభ్యుదయ కవితకు అట్టివాడే అయిన శ్రీ శ్రీ నవ్య కవితకు కావలసిన వస్తుసామగ్రిని ప్రతీకాత్మముగా పేర్కొనుచు

"సిందూరం రక్తచందనం
బంధూకం సంధ్యారాగం
పులి చంపిన లేడి నెత్తురూ
ఎగరేసిన ఎఱ్ఱని జెండా

రుద్రాలిక నయనజ్వాలిక
కలకత్తా కాళిక నాలిక
కావాలోయ్ నవకవనానికి"

అన్నాడు. ఇందులో శ్రీ శ్రీ నవకవితా స్వరూప స్వభావాలను తెలిపినట్లు విమర్శకులు వివరించుచున్నారు. ఈ దృష్టితో 'రమణీ ప్రియదూతిక' అను పద్యార్థమును విచారించిన పెద్దన జెప్పిన సామగ్రిని బట్టి అంచెలి,

రమణీ – రమణీప్రియదూతిక–కప్పురవిడెము – ఆత్మకింపయిన భోజనము–ఉయ్యెలమంచము–, అనువానిచేత 'శృంగారబంధ' మున రతి యను స్థాయి భావము ఉత్పత్తికి ముఖ్య హేతువులయిన నాయికాది ఆలంబన, ఉద్దీపన విభాగములను సూచించినట్లు మన మూహింపవచ్చును. ఇందలి 'రమణి' యే ఆలంబన విభావమయిన ప్రబంధ నాయిక. ప్రత్యేకముగా 'రమణి' శబ్దమును పెద్దన చెప్పక 'రమణీప్రియదూతిక' అని చెప్పినాడు. రమణి ఉన్నపుడే రమణీప్రియదూతిక యుండుటకు వీలుండును. ఇక మిగిలిన నిరుపహతిస్థలము (ఉద్యానాదులు), ప్రియదూతిక, కప్పురవిడెము, ఇంపయిన భోజనము, ఉయ్యెల మంచము అనునవి తటస్థములయిన ఉద్దీపన విభావములు. స్థాయి భావమును రసముగా పరిణమింపజేయు విభావానుభావ సాత్త్విక సంచారులలో మొదటిదియు ముఖ్యమయినదియు అయిన విభావమును జెప్పుటచే తక్కిన మూడును వ్యంగ్యముగా సూచితములయినట్లు భావింపవచ్చును.

విభావానుభావాదులచే పరిపుష్టమయి వర్ణనాదులకును నవీన కావ్యరచనకును అనుకూలమయిన కథావస్తువు లభించినగాక, ఊరక కృతుల్ రచింప సాధ్యము కాదని పై పద్యము సారాంశము. ఇది కావ్యరచనా సంప్రదాయమునకు సంబంధించిన వ్యంగ్యార్థము.

సంసార సంబంధమయిన బాదరబందీలేక సుష్టుగా భోజనముచేసి తాంబూలచర్వణముచేయుచు, ఎట్టి అంతరాయమునకు ఎడమీయని నిరుపహతి స్థలమునందు, రసజ్ఞులతో లేఖక పాఠకోత్తములతో ఒక్కచో కూర్చుండు అవకాశ ముండిన గాని, కృతిరచించుట శక్యముగాదనుట సామాన్యమయిన (వాచ్య) అర్థము.

కవితా ప్రావీణ్యఫణీశుడయిన కృష్ణరాయలుమాత్రము సామాన్యుడా పెద్దన ఇంగితమును గ్రహించి వెంటనేమహాకవికి 'కోకటకాదిగ్రామము లనేకము అగ్రహారములుగా ధారాదత్తముగావించి, మహాకావ్య నిర్మాణమునకు అనుకూల పరిస్థితులు కల్పించినాడు. అటుపిమ్మట ఒకనాడు రాయలు 'భువన విజయ' మను పేరుగల తన సభా భవనమునందు పెద్దన, తిమ్మన, ధూర్జటి, మాదయ గారి మల్లన మున్నగు అష్టదిగ్గజ కవులును, ఇతర కవిపండితులును పరివేష్టించి యుండ కొలువుదీఱినాడు. పెద్దన మహాకవిని దయార్ద్రదృష్టితో తిలకించి ఆ మహారాజు

**4**

**హితుఁడవు, చతురవచోనిధి,**
**వతుల పురాణాగమేతిహాస కథార్థ**
**స్మృతియుతుఁడ, వాంధ్రకవితా**
**పితామహుఁడ, వెవ్వ రీడు పేర్కొన నీకున్.**

అని యతని కవితా శక్తిని, వాక్చాతుర్యమును, అసమానత్వమును ప్రశంసించినాడు. నీవు నాకు హితుడ వన్నాడు. చతురవచోనిధి వన్నాడు. ఆంధ్రకవితా పితామహుఁడ వన్నాడు. నీకు సాటి నీవే అన్నాడు. ఇందలి 'హితుడ' వనుమాట కవిపట్ల రాయలకుగల స్నేహగౌరవములను ప్రకటించును. 'చతురవచోనిధి' అనుట పెద్దనకవితయందలి ప్రధానగుణమును ఒక్క మాటలో సంగ్రహించుట. ఆంధ్ర కవితా పితామహుఁడనునది పెద్దన బిరుదము. ఈ బిరుదము రాయలిచ్చినది కాదని మనుచరిత్ర రచనకు పూర్వము నుండియు నున్నదని పెద్దల తలంపు. మనుచరిత్రమును రచించుటకు చాల ముందుగనే పెద్దన 'హరికథాసార' మను కావ్యమును రచించి తన గురువయిన శఠకోప యతీంద్రునకు కృతి యిచ్చినాడు. ఈ గ్రంథమిపుడు లేదు. శఠకోపయతీంద్రులే 'ఆంధ్ర కవితాపితామహ' బిరుదును శిష్యునకు ప్రసాదించియుండు ననుకొనుట కూడ అసంభవముకాదు.

పిమ్మట రాయలు.

**5**

**సప్త సంతానములలోఁ బ్రశస్తిగాంచి,**
**ఖలము గాకుండునది ధాత్రిఁ గృతియ కానఁ**

**గృతి రచింపుము మాకు శిరీషకుసుమపేశల**
**సుధామయోక్తులఁ బెద్దనార్య!**

అని అర్థించినాడు. తనయుడు, తటాకము, కావ్యము, నిధి, గుడి, ఉద్యానవనము, దేవాలయము అను ఇవి సప్తసంతానములు. తన పేరును సంతానమెట్లు లోకమున చిరకాలము నిలుపునో, తక్కిన తటాక కావ్యాదులును అట్లే వానిని నిలిపినవారి పేరును భూమిపై నిలుపునని భావము. అయినను వీని యందు తారతమ్యము గలదు. 'ఇల సప్తసంతతులలోపలఁ గావ్యము దక్క-దేవభవనాదుల్ ఖిలములగు' నని యొక కవి. 'గుడి గూలును, నుయిపూడును... చెడనిది పద్యం బొక్కటె' యని వేఱొక కవి సరళ వాక్కు. కావుననే పెద్దనచే కావ్యము కృతిగొని కవిపేరుతో పాటు రాయలు తన పేరును అజరామరము చేసికొన దలచినాడు. పెద్దనార్య! శిరీషకుసుమపేశల సుధామయోక్తులతో ఒక కావ్యమును రచించి దానిని 'నాకు కృతియి' మ్మనినాడు. 'సుధామయోక్తుల' కును పెద్దనార్య! అను పదమునకు నడుమ నున్న అరసున్న' (ఁ) తొలగించిన యెడల, శిరీష... పెద్దనార్య వరకు గలవాక్యమంతయును పెద్దన సంబోధనమే కాగలదు. శిరీషకుసుమపేశల సుధామయోక్తుల పెద్దనార్య. అనునది విశేషణమయి పెద్దన శిరీష... ఉక్తులు కలవాడను భావమేర్పడి, 'చతురవచోనిధి' అర్థము వంటి అర్థము సిద్ధించును. మొదటి పక్షమున కావ్యరచనకును; రెండవ పక్షమున ఈ సమాసము కవికిని సంబంధించి అర్థ విశేషము నొసగును. శిరీషకుసుమ మనగా దిరిసెనపూవు. దీని కేసరములు పట్టు కుచ్చులవలె సన్నగా తెల్లగా మెత్తమెత్తగా నుండును. సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర కవులలో ఈ పూవును పేర్కొననివారు లేరు. ఇది మార్దవమునకు ప్రతీక. తావిగాని మకరందముగాని ఇందున్నట్లు కనబడదు. ఉన్నచో పసిడికి తావి యబ్బిన భాతిగా నుండును. పెద్దనగారి ఉక్తి శిరీషకుసుమములందు మృదుత్వముతో పాటు మకరందమే కాదు, 'సుధ' అనగా అమృతము కూడ పుష్కలముగా నుండును. కావుననే ఆయన 'శిరీషకుసుమ పేశల సుధామయోక్తులపెద్దనార్యుడు'. అనగా ఆయన రచనము మృదు మధుర పదబంధురమని సారము.

చతురవచోనిధి, శిరీష పేశల సుధామయోక్తులను వాడిచే శ్రీకృష్ణదేవరాయలు పెద్దన కవిత యందలి ముఖ్య లక్షణములను, ఆయన కవితా

వైభవమును గూడ ప్రశంసించిన వాడయ్యెను. అందుకే 'కవి యల్లసాని పెద్దన, కవి తిక్కన సోమయాజి, గణుతింపంగా, కవి నేను రామకృష్ణుడ' నని తెనాలి రామకృష్ణ కవి యంతటి వాని చాటుప్రశంస వినవచ్చుచున్నది. కృతిరచింపు మని పెద్దనను కోరుటే కాక కృష్ణరాయలు.

## 6

'మనువులలో స్వారోచిష
మను సంభవ మరయు రసనముంచిత కథలన్
విన నింపు. కలిధ్వంసక
మనఘ భవచ్చతురరచన కనుకూలంబున్'

ఆకవి వ్రాయవలసిన కావ్య నామమును, కథా వస్తువును దెలిపి, దానిని మార్కండేయ పురాణోక్త ప్రకారంబున జెప్పుమని కర్పూర తాంబూలము పెట్టించెనట! ఈ పద్యమును జూచి కొందఱు పెద్దనకు కథను గూడ రాయలు తెలుప వలసి వచ్చెనని కువిమర్శ చేసిరి. కాని, యిట్లు చెప్పుట పూర్వకవి సంప్రదాయము. అంతే కాదు. 'స్వారోచిషమను సంభవ' మను పేరుకు తగి నట్లుగాని, సంగ్రహనామ మయిన 'మను చరిత్ర' మను పేరుకు తగినట్లుగాని అందలి కథ లేదని కూడ నాక్షేపించుట కలదు. కాని, ఈ యాక్షేపణము సరి యైనది కాదు. ఈ పద్యము నందలి 'స్వా రోచిషమను సంభవ మరయ రస సముంచిత కథలన్ విననింపు' అనగా స్వారోచిషుడను రెండవ మనువు సంభవ వృత్తాంతము మార్కండేయ పురాణమునందు అనేకము లయిన రసవంతము లయిన కథలు కలిగి వినుటకు ఇంపుగా నుండు ననియు, కావున కవి తత్సంభవ వృత్తాంతమును నానా వర్ణనలతో నొక ప్రబంధముగా రచించుటకు, సంకల్పించినట్లు స్పష్టమగుచున్నది. ఇందు ముఖ్యముగా రెండు కథలు గలవు. వరూధినీ ప్రవరుల కథ మొదటిది. వరూధినీ మాయా ప్రవరుల కథ కూడ ఉన్నట్లు తోచినను అది మొదటి దాని యందే అంతర్భవించును. రెండవది స్వరోచి వృత్తాంతము. ప్రవర మాయా ప్రవర వరూథినుల కలిపి చూచిన అది

(మొదటి మూడాశ్వాసములు) స్వరోచి సంభవ కథ కాగలదు. నాల్గవ ఆశ్వాసము నుండి ప్రారంభింపబడిన స్వరోచి కథలో మనోరమ కథ, ఆమె తండ్రియగు ఇందీవరాక్షు డను గంధర్వుని కథ, మఱియు మనోరమ చెలులగు కళావతీ, విభావసుల కథలు మున్నగునవి కలవు. అవి యన్నియును రసవంతములే. వన దేవతా స్వరోచుల వృత్తాంతము చివరిది. ఈ కథ మాత్రమే స్వారోచిషమను సంభవ కథ. ఇది మిగుల చిన్నది. ఏకాశ్వాస ప్రబంధ రచనకు గూడ చాలనిది. అంత రసవంతమునుగాదు. కావుననే కవి రస సముచితములైన పెక్కు కథలతో గూడి తన చతుర రచన కనుకూలమయిన స్వారోచిషమనుసంభవ సకల వృత్తాంతము రసవత్ప్రబంధముగా రచింపదలచి యట్లే రచించినాడు. కావున కావ్యమును సహృదయముతో పఠించి సద్విమర్శచేయుట సమంజసము.

మను చరిత్రము నందలి ప్రథమ కథకు నాయకుడు ప్రవరుడను విప్ర వరుడు. అరుణాస్పదపురము ఆయన ఉనికి పట్టు. మహా కావ్యమునం దుండ దగిన అష్టాదశ వర్ణనలలో మొదటిది పురవర్ణనము. కావున పెద్దన ఈ ప్రబంధ మును తద్వర్ణనముతో ప్రారంభించినాడు.

## 7

**వరణా ద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ చుంబితాంబరమై**
**సౌధసుధాప్రభా దవళిత ప్రాలేయరుఙ్మండలీహరిణంబై**
**యరుణాస్పదం బనఁగ నార్యావర్త దేశంబునం**
**బుర మొప్పు న్మహికంఠహారతరళ స్ఫూర్తిన్ విడంబించుచున్.**

ఆర్యావర్తమునందలి వరణానదీ తీరమున అరుణాస్పదమను పురము కలదని దీని సారాంశము. ఈ చిన్న విషయమును కవి అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, ఉపమాలంకారములతో, తనకు సహజమయిన చతుర రచనతో అందముగా ఆవిష్కరించినాడు. ఆపురమునందలి ప్రాకారములు అంబరమును చుంబించుచుండు ననియు, మేడలకు వేసిన తెల్లని సున్నపు కాంతులు చంద్రునిలోని జింకవంటి నల్లని మచ్చను తెల్లగా జేయుచుండుననియు, ఆ పురము భూదేవి కంఠహారము నందలి నాయకమణివలె నొప్పుచుండెననియు చెప్పెను. ఈ పద్యము దీర్ఘ సమాసములతో గూడియున్నను పరుషాక్షర రహితము. ద్వీపవతీ, వప్రస్థలీ,

రుజ్మండలీ, అను సమతూకము గలిగిన సమస్త పదములు 'ఈ' కారాంతములై శ్రవణ సుఖము కలిగించుచున్నవి. 'సౌధ సుధాప్రభా ధవళిత' అను కూర్పు నందలి 'ధ' వర్ణావృత్తి, చుంబితాంబరమై,హరిణంబై , విడంబించుచున్, అను వానియందలి బిందు పూర్వక బ (ంబ) వర్ణమును తిరిగి తిరిగి చెప్పుటచేత, సౌకుమార్యమను గుణమును సంతరించుకొని, వీనులకు విందును మనస్సుకు హాయిని కలిగించుచున్నవి. ఇట్టి రచనా చమత్కారము ఈ కావ్యమున పలుచోట్ల సాక్షాత్కరించుచుండును.

## 8

అచటి విప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి
ముదిమది దప్పిన మొదటివేల్పు
నచటి రాజులు బంటు నంపి భార్గవునైన
బింకాన బిలిపింతు రంకమునకు
నచటి మేటి కిరాటు లలకాధిపతినైన
మునుసంచిమొద లిచ్చి మునుపదక్కు
లచటి నాలవజాతి హాలముఖాత్త విభూతి
నాదిభిక్షువు భైక్షమైన మాన్చు
నచటి వెలయాండ్రు రంభాదులైన నౌరయ
కాసెకొంగున వారించి కడపగలరు
నాట్యరేఖా కళాధురంధర నిరూఢి
నచటఁ బుట్టిన చిదురుఁగొమ్మైన జేవ.

ఇది పై పురవర్ణనమునకు సంబంధించిన రెండవ పద్యము, పెక్కు పద్యములు వ్రాయక కవి దీనితో ఈ వర్ణనమును ముగించినాడు. కథాదృష్టితో గూడ ఈ పద్యము ముఖ్యమయినది. ఇందలి మొదటి కథకు నాయకుడు విప్రుడు. నాయిక దేవవేశ్య వరూధిని. కావున ఈ పద్యమును బ్రాహ్మణ వర్ణనతో ప్రారంభించి, గీతము పూర్తిగా వేశ్యల వర్ణనలతో ముగిసినది. చాతుర్వర్ణ వర్ణనమును బ్రాహ్మణ వర్ణముతో మొదలిడుట కవి సంప్రదాయమే, అయిన

నిందు వేశ్యావర్ణనము నిర్బంధము కాదు. రెండవ కథకు నాయకుడు స్వరోచి రాజు. రెండవ పాదము క్షత్రియ వర్ణనము. అందలి వేశ్యలు రంభాదులను గూడ తమ కాసెకొంగుతో వారించి పంపివేయ వలతులట! అచట పుట్టిన చిగురు గొమ్మకూడ నాట్య విద్యయందు దారితేరి చేవ గలిగి యుండునట! రంభాదులను గూడ అందముచేతను నృత్య గానాదుల చేతను తిరస్కరింపగల వెలయాండ్రకు ఆటపట్టయిన అరుణాస్పదమున, నిర్వికారుడై కాపురము చేయుచుండు ప్రవరుని భవిష్యత్కథలో, రంభాదులు చెలులుగా గలిగిన వరూధినీ సౌందర్యగానాదులు చలింపజేయ జాలకుండెనను కథాంశమునకు ఈ గీతము నందును; 'వాని చక్కదనము వైరాగ్యమునజేసి' అను తర్వాతి పద్యము నందును బీజములు వెదచల్లినాడు. ఈ బీజములు ద్వితీయాశ్వాసమున మొలకెత్తి, చిగురించి, మొగ్గతొడుగుట కాననగును. తృతీయాశ్వాసమున మాయాప్రవరుడను అంటు మొక్కరూపము దాల్చి యది ఫలించుట చూడనగును. ఈ సామాన్య సీస పాదము లందును గీతము నందును కవి అనల్ప శిల్ప కౌశలమును ప్రదర్శించియున్నాడు. ముది ముది దప్పిన మొదటి వేల్పు, బంటు నంపి భార్గవునైన బింకాన బిలింపింతురు, (పరశురాముడు రాజుల నందరను పరిమార్చిన వాడు. అట్టివాని నిచటి రాజులు బంటుతో కబురంపి రప్పించుకొందురట!);

'సంచి మొదలిచ్చి, ఆది భిక్షువుబైక్షము; కాసెకొంగున వారించు, చిగురుఁ గొమ్మైనజేవ' అను ప్రయోగములు గమనింప దగియున్నవి. ఈ పద్యమున కివి ఎన లేని సొంపు నాపాదించినవి. ఇందలి 'కడపఁగలరు' లోని 'కడప' యనగా కడప మండల మనియు, అచ్చట 'చిగురు' చెట్టను పెఱుసు దనముతో గూడి చేవలేని ఒక చెట్టు గలదనియు, అరుణాస్పదమున గల చిగురు గొమ్మయు చేవగలిగి నాట్యము చేయుచుండుననియు పండితులు విశేషార్థము చెప్పుదురు. చిగురుఁ గొమ్మయున లేతకొమ్మయని సాధారణార్థము. కొమ్మయనగా స్త్రీ గావున చిగురుఁ గొమ్మయను దానికి అచ్చట పుట్టిన చిన్న పిల్లలు (బాలికలుకూడ) నాట్య విద్య యందు చేవగలిగి యుందు రను అర్థ విశేషమును గూడ చెప్పుకొన వచ్చును.

కథార్థసూచకముగా నిట్లు పురవర్ణనమును ముగించి తర్వాతి కొన్ని పద్యములలో కవి నాయకగుణవర్ణనము కావించినాడు. ఈ క్రింది ఒకటి రెండు పద్యములు మిగుల ప్రసిద్ధములు.

## 9

**ఆ పురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి, భా**
**షాపరశేషభోగి, వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ**
**క్షాపరతంత్రుఁడు, అంబురుహాగర్భకులాభరణం, బనారతా**
**ధ్యాపన తత్పరుండు, ప్రవరాఖ్యుఁడలేఖ్యతనూవిలాసుఁడై.**

నాయకు డయిన ప్రవరుని రూపవిద్యావైదికనిష్ఠాభిజాత్యము లిందు వర్ణితములు. ఇందలి 'మకరాంక శశాంకమనోజ్ఞమూర్తి' అను సమాస వాక్యమునకు మన్మథునివలె, చంద్రునివలె మనోహరమైన రూపము గలవాడనుట సామాన్యార్థము. కాని, పెద్దన చతురవచోనిధి కావున నించుక గమనించినచో నింతకంటెను రమణీయార్థము స్ఫురింపకపోదు.

మన్మథ చంద్రులకు పెద్దన యిందు వరుసగా మకరాంక, శశాంక శబ్దములను మరియు మనోహరమను నర్థమున 'మనోజ్ఞ' శబ్దమును బ్రయోగించినాడు. మకరాంకుడనగా మొసలి గుర్తు (టెక్కెము) గలవాడనియు, శశాంకుడన కుందేలు గుర్తు (మచ్చ) గలవాడనియు అర్థము. ఈ ఇరువురును అందగాండ్రే యయినను, వీరిరువురి యందును ఒక్కొక్క లోపము గలదు. కాబట్టి అట్టి లోపములు కనబడనివిధమున, వీరి యాకారములను గలిపి చూచిన ఎట్టి సుందరాకారము రూపొందునో, అట్టి మనోజ్ఞమయిన అనగా మనసుచేత మాత్రమూహించి తెలిసికొనదగిన రూపముగలవాడు ప్రవరుడని యిందలి విశేషార్థము. అట్లే పద్యము చివరగల 'ప్రవరాఖ్యు డలేఖ్యతనూవిలాసు' డనగా చిత్తరువునందు లిఖింప సాధ్యముగాని దేహసౌందర్యము కలవాడని సామాన్యార్థము. లేఖశబ్దమునకు దేవత యని అర్థము. లేఖ్యమనగా దేవతలకు సంబంధించినది. కావున అలేఖ్య తనూవిలాసు' డనగా దేవతలకుగూడ లేని దేహసౌందర్యము కలవాడని యూహింప వీలగుచున్నది. ప్రత్యేకముగా మకరాంకునకును, శశాంకునకును దేవతలకును లేనిరూపసంపద గలవాడని భావము. కావుననే నిత్యమును పైదేవతలను జూచుచుండినను మనోవికారమును పొందని వరూధిని, ప్రవరుని జూచినంతనే అతని అతిదేవతా సౌందర్యమునకు అమ్ముడుపోయినది అని సారస్యము. కవి యొక్క సమాస నిర్మాణ చాతుర్యముతోపాటు, 'మకరాంక శశాంక' లోని

దీర్ఘాక్షరముల తర్వాత బిందుపూర్వక 'క' వర్ణావృత్తి, భాషా, నిర్మలధర్మకర్మ అను శబ్దాలంకారమును, మరియు పద్యమునందలి 'అర్థపరమైన ఉపమారూపకా లంకారములును గమనార్హములు.

## 10

వాని చక్కదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె.

ఇంత చక్కదనముగల ప్రవరుడు వైరాగ్యభావము కలవాడు. లౌకిక సుఖములు అతని దృష్టిలో తుచ్ఛములు. కావున సంపెంగ సౌందర్యము మధుక రాంగనలకు భోగబాహ్యమయిన విధమున, అతని సౌందర్యము కాంక్ష సేయు జారకామినులకు అనుభవింపరాని దయినదట ! తరువాతి కథలో సరిగా అట్లే జరిగినది. అతని వైరాగ్యభావము నెఱుగక ఆకారసౌష్ఠవమునకు మోకరిల్లిన వరూధినికి అందరానిదియు పొందరానిదియు అయినది. పెద్దన యెడనెడ నిట్లు వర్ణనలలో భవిష్యత్కథాంశమును మాటల మాటున పొందు పఱుచుచుండును. ఇట్లు చేయుట వస్తుధ్వనిశిల్పము, చమత్కారజనకము.

వ్యక్తి వర్ణనమును స్వభావసిద్ధముగా జేయుటయందు పెద్దన సిద్ధహస్తుడు. ప్రవరునియింటి కొకనాడు వచ్చిన సిద్ధుని మనము కన్నులార జూడవచ్చును.

## 11

ముడిచిన యొంటికెంజెడ మూయు మువ్వన్నె
మెకముతోలు కిరీటముగ ధరించి
కకపాలకేదారకటకము ద్దితపాణిఁ
గుఱుచలాతాముతోఁ గూర్చిపట్టి
నైణేయమైన యొడ్డాణంబు లవణిచే
నకళించినపొట్ట మక్కళించి

యారకూటచ్ఛాయ నవఘుళింపఁగఁజాలు
బడుగు దేహంబున భస్మమలఁది
మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్షపోఁగులు చవుకళింపఁ
గావి కుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహ మౌషధసిద్ధుఁ డొకఁడు.

తలమీద పులితోలు కుళ్ళాయి, చంకకు తగిలించిన సంచి, చేతిలో యోగదండము, ముంజేతి పంచలోహపు కడియము, నడుముకు గుత్తముగా బిగించిన జింకచర్మపు పట్టా, బడుగుదేహమున భస్మపుపూత, మిట్టయురముపై యోగపట్టె, చెవులకు రుద్రాక్షపోగులు, ఒంటినిండ కాషాయపుచొక్కా, ఒకచేత కమండలము ఇది సిద్ధుని వేషము. ఇట్లు వర్ణించుటకు సూక్ష్మపరిశీలనము, లోకజ్ఞానము మిక్కిలి యవసరము.

అట్లు వచ్చిన సిద్ధుడు గృహస్థాశ్రమమే తక్కిన ఆశ్రమముల కన్న మిన్న యనును.

## 12

కెలఁకుల నున్న తంగెటిజున్ను గృహమేధి,
యజమాను డంకస్థితార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు,
దొడ్డిఁబెట్టిన వేల్పుగిడ్డి కాఁపు
కడలేని యమృతంపునడబావి సంసారి
సవిధ మేరునగంబు భవనభర్త
మరుదేశపథ మధ్యమప్రపకులపతి
యాఁకటి కొదవు సస్యము కుటుంబి
బధిరపంగ్వంధభిక్షుక బ్రహ్మచారి
జటిపరివ్రాజకాతిథిక్షపణ కావ
ధూతకాపాలికాద్యనాథులకుఁ గాన,
భూసురోత్తమ ! గార్హస్థ్యమునకు సరియె ?

ఈ సీసము నాల్గుపాదములును సమతాగుణ సముపేతములు. ఇందలి గృహమేధి, యజమానుడు, వాస్తవ్యుడు, కాఁపు, సంసారి, భవనభర్త, కులపతి, కుటుంబి సంసారి అను పదములను గృహస్థునకు పర్యాయపదములుగా ప్రయోగించుచు, వాడిన మాటను తిరిగి వాడక నేర్పుచూపినాడు కవి. తంగేటి జున్ను, అర్థపేటి, పెరటికల్పకము, వేల్పు గిడ్డి, అమృతంపు నడబావి, మేరునగము, అను ప్రసిద్ధార్థక పదసముదాయమును ప్రయోగించి, ఇందు ప్రసాదగుణమును కవి పొందుపఱచినాడు. చదివినవెంటనే పద్యార్థము స్ఫురించునట్లు దీర్ఘసమాసరహితముగను, సరసవాగ్విన్యాసముగను రచింపబడిన యిది మాధుర్యగుణధుర్యముగా నున్నది. గీతపాదములను దీర్ఘ సమాసముతో రచించి ఓజోగుణ విలసితలు గావించినాడు కవి. ఉత్తమ గృహస్థధర్మ ప్రతిపాదనమే ప్రధాన ప్రయోజనముగా రచింపబడిన మను చరిత్రమునందలి మకుటాయమానములయిన పద్యములలో నిది యొకటి. కెలఁకులనున్న—తంగేటి జున్ను—గృహమేధి—యజమానుడు, అంకస్థిత—అర్థపేటివంటి అలతి—యలతి పదములతో కాహళ పూరించినట్లు, అల్పాక్షరముల ననల్పార్థ స్ఫురణము కలుగునట్లు, ఒక్క పదమును గాని మార్చుటకును చేర్చుటకును యెడమీనివిధమున, చదివినకొలదిని చవులూరించునట్లు, సంగీతగుణ ప్రధానముగ రచింపబడి, చెక్కినొక్కులు దీర్చినట్లు అల్లసానివాని అల్లికజిగిబిగి సానల దీరిన జాతిరత్నమీ పద్యరత్నము.

సిద్ధునికి సపర్యలు చేసి 'అయ్యా, ఏయే దేశములన్ వసించితిరి మీ రేయే గిరుల్ చూచినా' రని ప్రవరు డడిగిన ప్రశ్నకు సమాధానముగా నా ఔషధ సిద్ధుడు చెప్పిన-

## 13

**ఓ చతురాస్య వంశకలశోదధి పూర్ణశశాంక ! తీర్థ యా**
**త్రాచణశీలినై జనపదంబులు పుణ్యనదీనదంబులున్**
**జూచితి నందు నందుఁగల చోద్యములున్ గనుఁగొంటి, నాపటీ**
**రాచల పశ్చిమాచల హిమాచల పూర్వదిశాచలంబుగన్.**

సమాధాన మీ పద్యము. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! తీర్థయాత్రలు చేయుచు నేను దేశము యొక్క నాల్గు చెఱగుల పర్యటించి అందలి వింతలను కొనుగొంటి

ననుట యిందలి భావము. ఈ భావమునందు కవితాంశ లేశమాత్రమును లేదు, ఈ సామాన్య విషయమును పెద్దన ఈ పద్య గర్భమునందు నిక్షేపించి, దాని ఆద్యంత భాగములందును చెక్కడపు పని చేసిన రెండు అపూర్వ శిల్ప ఖండములను శోభాయ మానముగా నిల్పినా డీ సాహిత్య శిల్పి! ఇందలి మొదటి పాదమును ప్రవరుని సంబోధనరూప ద్వారతోరణముగా నలంకరించి నాల్గవ పాదమునందు, నాల్గు దిక్కులను దెలుపు పటీరాచల, పశ్చిమాచల, హిమాచల, పూర్వ దిశాచలంబులను ఆంధ్ర కవితా పితామహుడు తన కవితా దిగ్విజయ సూచక స్తంభములవలె నిలిపినాడు. సామాన్య భావమునకు చక్కని కవితా రూపమును కల్పించినాడు. చప్పని పానీయమును చల్లని ద్రాక్షారసముగా మార్చి బంగారు గిండ్లతో పాఠకుల కందించినాడు. ఎత్తుగడలో ఎనలేని సౌభాగ్యమును సంతరించి, ముగింపులో ముక్తాయింపులను కుదించి సవరించినాడు పెద్దన! ఆయన చతుర రచనా శిల్పమునం దిది యొక మెల్పు.

ప్రవరుని తీర్థయాత్రా ఔత్సుక్యమును దీర్పగోరి సిద్ధుడు దంతపు బరణిలో భద్ర పరచిన పాదలేపమును దివ్యౌషధ రసము నతని పాదములకు పూసి వెడలి పోయినాడు.

## 14

**అమం దిడి యతఁ డరిగిన**
**భూమీసురుఁ డరిగె తుహిన భూధర శృంగ**
**శ్యామల కోమల కానన**
**హేమాద్ర్య దరీఝరీ నిరీక్షాపేక్షన్.**

అపుడు ప్రవరుడు మంచుమల మీది కాననములను, దరులను, ఝరులను చూచు కోరికతో, పోయినాడనుట ఇందలి భావము . ఈ జడభావమునకు పెద్దన తన పదప్రయోగ కౌశల్య మంత్ర ప్రభావముచే జీవముపోసి, శిరీషకుసుమ పేశల సుధామయోక్తులతో ఒయ్యారముగా నడిపించినాడు. మను చరిత్రము నందలి ప్రతి పద్యము నందును అల్లసానివాని యల్లిక జిగిబిగి ఏదో యొక రూపమున వెల్లివిరియు చుండును. మొదటి ఒకటిన్నర పాదము తిన్నని తెలుగు మాటలతో సాగినది. తర్వాతి పద్య భాగమంతయు ఒకే దీర్ఘ సంస్కృత

సమాసముతో తుదిదాక సాగి ప్రవరుని గమన వేగమును సూచించుచున్నది. ఈ సమాసాదిలోని నగణ, భగణ, గగములు (తుహిన, భూధరశృంగ) మూడును భూమిపై నుండి ఆతడు హిమాద్రి శృంగమున కెగిరి పోవుటను, తర్వాతి 'శ్యామల కోమల కానన' అను మూడు భగణములు శృంగము నుండి క్రమముగా కొండమీదికి దిగుటను, ఆ తర్వాతి దరీ, ఝరీ, సరీ, అను లఘు పూర్వక ఇత్వ దీర్ఘ 'ర' వర్ణములు మూడును అచ్చటి దరులును ఝరులును ఓకేసారిగా అతని కగుపించిన విధమును మరియు చివరి 'నిరీక్షా పేక్షన్,' అను ధ్వను లతడు గమనము నాపి ఒక్కచో నిలిచిన విధమును అర్థాపేక్ష లేక, నడక చేతను ధ్వనులచేతను సహృదయ పాఠకులకు సూచించు చున్నవి. శబ్దాలంకారముల సొంపు చెవులకు ఇంపు గొలుపుచున్నది. వీణియ తంత్రులను ఒక ప్రత్యేక లయ పద్ధతిలో గోట మీటి నట్లు కొనలు సాగు 'శ్యామల... దరీ ఝరీ నిరీక్షా పేక్షన్' అను కూర్పును మగల మరల జదివికొని నాదబ్రహ్మము నందు పాఠకుల చిత్తము లగ్నమయి పరవశించునేకాని పదార్థముల మీదికి పరుగులెత్తదు. పద ముల కూర్పుల నేర్పులతో పరవశులను గావించుట కూడ నొక శిల్పమే. ఇట్టి శిల్పమీ కావ్యమున నెడ నెడ తడబడుచుండును.

హిమాలయము మీది రమణీయ దృశ్యములను కమనీయ, వాక్చిత్ర ములుగా మలచినాడు పెద్దన.

## 15

**అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ**
**పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్స్వన**
**స్ఫుట నటనానురూప పరిపుల్ల కలాపకలాపిజాలమున్**
**గటక చరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్.**

ఆంధ్ర కవితా పితామహుని 'యల్లిక జిగిబిగి' నాద్యంతమును నింపుకొని, శ్రవణ నయన హృదయేంద్రియములకు శబ్దార్థముల మేళవింపుల పసందులతో విందులు చేయుచు, చిందులు వేయుచు, చిత్తములకు శివమెత్తించు ఉత్తమ పద్యో పాయన మీ చంపకము. మంచుమలమీద ప్రవరుడు తిలకించిన మొట్టమొదటి రమణీయదృశ్య మిది. ఆకాశమును తాకుచున్న కొండకొనలనుండి సెలయేళ్ళు

పొరలుచు దొరలి పడుచున్నవి. మృదంగనాదములవలె నున్న వాని మ్రోతల చప్పుళ్ళకు నెమళ్ళు పురులువిప్పి నాట్యముచేయుచున్నవి. పర్వత మధ్య మందున్న వృక్షములను తొండములు పైకెత్తి ఏనుగులు ఊగిసలాడించుచున్నవి. ఎన్ని సుందర దృశ్యములు! వీనిని అనురూప పదబంధములతో కన్నుల గట్టి నట్లు, చెవుల సోకునట్లు, మనస్సులకు హత్తుకొనునట్లు శబ్దాలంకారములతో, శబ్ద ధ్వని శిల్పముతో చిత్రించినాడు పెద్దన. మనుచరిత్ర కావ్యపు పుటలలోకంటె తత్పాఠకుల నాలుకల కొనలమీద ముద్రితమయి భద్రముగా నున్నదీ పద్య రాజము. ఇందలి అంబరచుంబి, శిరస్సరజ్ఝరీ, అభంగ తరంగ మృదంగ, మున్నగు పదబంధములు శబ్దధ్వనిభూషితములై వానివాని యర్థములను పట్టి యిచ్చుచున్నవి. భళిరా! కవిచాతుర్యము!

## 16

**ఉల్లల దలకాలలకణ**
**పల్లవిత కదంబ ముకుళపరిమళలహరీ**
**హల్లోహల మదబంభర**
**మల్లధ్వను లెసగ విసరె మరుదంకురముల్.**

అక్కడి దృశ్యములు జూచుచు నిలిచిన ప్రవరునిమీద మెల్లని చల్లనిగాలి విసరినది. అటువైపునుండే గండుతుమ్మెదల మ్రోతలు మ్రోగినవి. అర్థము కంటె ఇందలి పదములకూర్పులో, పాదముల తీర్పులో కవిచూపిన నేర్పు గమ నింప దగియున్నది. ప్రాసస్థానములలో నిలిపిన ద్విత్వలకారముతోడఁ ఉల్లల దలకేత్యాది పదబంధములు లయతాళయుక్తములై, నాలుకపై నర్తించుచు ఔదార్యముతో నడయాడుచున్నవి. 'ల' వర్ణ పునఃపునరావృత్తి శ్రవణ సుఖ మును కలిగించుచుండగా, కదంబ, మదబంభర శబ్దములు తుమ్మెద మ్రోతల కును, ఎసగ విసరె అను 'స' వర్ణావృత్తి 'స్' ను అను గాలివీచు ధ్వనికి ప్రతి ధ్వనులుగా కూర్పబడినవి.

అట్టి చల్లగాలికి ప్రవరుడు కొంత సేదదేరి చూచుచుండగా, అచ్చటి

యడవిలో నతనికి జంతు సంతానమునకు సంబంధించిన వింతదృశ్యములు కను విందు గావించినవి.

## 17

తొండము ల్సాచి యదుంగు జిగుళ్ళకు నిక్కు-
కరుల దంతచ్ఛాయ గడలు కొనఁగ
సెలవుల వనదంశములు మూఁగి నెఱవెట్టఁ
గ్రోల్పులుల్ పొదరిండ్ల గుఱక లిడఁగ
సెలయేటి యిసుకలంకల వరాహంబులు
ముత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
నడ్డంబు నిడుపు నాపడ్డలగలి మనఁ
బిళ్ళు డొంకలనుండి కేళ్ళుదాటఁ
బ్రబల భల్లూక నఖభల్ల భయద మథన
శిథిల మధుకోశవిసరవిశీర్ణ మక్షి
కాంతరాంతర దంతురితాతపమునఁ
బుడమి తిలతండుల న్యాయమున వెలుంగ.

ఇందలి సీసపాదములు నాల్గింటియందు నాల్గు దృశ్యములను, గీతము నందొక ప్రత్యేక దృశ్యమును కవి మృదు మధరశైలిలో మనోహరముగా వర్ణించి నాడు. గీతము దీర్ఘ సమాసముతో ఓజస్సమాధి గుణములతో గౌడీ రీతిలో అద్భుతముగా కూర్పబడినది.

ఒకచోట అందుగుఁ జిగుళ్ళు తినుటకు తొండములు పైకెత్తి మునిగాళ్ల మీద నిలిచిన నల్లని ఏనుగుల తెల్లని దంత కాంతులు నలుదిక్కుల వ్యాపించు చుండినవి. వేఱొకచోటపొదరిండ్లలో పెద్దపులులు పెద్దగా గుఱక పెట్టుచు నిద్రించు చుండినవి. వాని సెలవులపై అడవి యీగలు మాంసపు వాసనకు మూగి నెఱ పెట్టుచుండినవి. ఇంకొకచోట సెలయేళ్ల ఇసుక దిబ్బలను గుంపులుగా గూడిన అడవిపందులు ముట్టెలతో తుంగ గడ్డలను పెల్లగించుచుండినవి. మఱొకచోట

ఆవు పెయ్యలవలె బలిసిన మనుబిళ్లు డొంకలపైనుండి దూకిపోవుచుండినవి. ఒక్రేవ బలిష్ఠములయిన భల్లుకములు బల్లెముల బోలు తమగోళ్లతో తేనెతెట్టెలను ఆర్చికొట్టగా, తేనెటీగలు లేచిపోయి గాలిలో గుంపులు గుంపులుగా తిరుగాడు చుండినవి. వాని నీడలు ఎండ వెలుగుతో గూడిన భూమిపై అట నట నల్ల నల్లగా పడుచుండినవి. నీడలు పడని నేల తెల తెల్లగా నుండుటచే, ఈ దృశ్యము నల్ల నువ్వులు తెల్ల బియ్యము గలిపి చల్లినట్లు వింత గొలుపుచుండినది. ఇట్టి మనోహర దృశ్యములను చూచి ప్రవరు డబ్బురపడి ఉబ్బితబ్బిబ్బయి, 'తలమే బ్రహ్మకు నైన ఈ నగ మహత్వం బెన్న' అని కొనియాడుచుండు నంతలో మధ్యాహ్న మయినట్లు, సూర్యుని కిరణముల వేడికి కాగిన సూర్యకాంత శిలల మీద కరిగి పడుచున్న మంచు చుక్కల 'చుంయ్, చుంయ్' అను చప్పుళ్లు సూచించినవి. మాధ్యాహ్నిక కృత్యముల దీర్చుటకు ప్రవరు డింటికి పోవ సంకల్పించెను కాని మంచు నీటి చేత పాదములందలి పసరు కడిగివేయ బడుటచే, అతడున్నచోటనే యుండిపోయెను. జరిగిన ప్రమాదమును ప్రవరుడు గ్రహించి విచారగ్రస్తుడ య్యెను. ఇంటికి చేరు నుపాయము నెఱుగుట కటనట తిరుగాడు చుండెను. అంతలో నతనికి నొకచోట 'గంధర్వయక్షగాన ఘూర్ణితమగు నొక్కకోన' గనుపించినది. ఈ కోనను పెద్దన ఒక సీసమున ముద్దుగా వర్ణించినాడు. ఆకోన ఒక మునియాశ్రమము కాబోలు నని ప్రవరుడు భావించినాడు. అతని మనసున ఆస పొడసూపినది.

## 18

" నికట మహీధరాగ్ర తట నిర్గతనిర్ఝర ధారఁబాసి లో
యకుఁ దలక్రిందుగా మలకలై దిగు కాలువ వెంట బూచుమ
ల్లిక లవలంబనంబుగ నళి ప్రకరధ్వని చిమ్మిరేఁగలో
నికి మణిపట్టభంగ సరణిన్ ధరణీసురుఁ డేగి చెంగటన్.

అచటికి చేరువయందు కొండ కొననుండి వెడలి పాఱు సెలయేరు నుండి చీలిన ఒకపాయ తలక్రిందుగా మలకలు మలకలుగా లోయలోనికి దిగి కాలువగా పాఱుచుండెను. ఆ కాలువవెంట మల్లెలు పూచినవి. పూలపాలు తుమ్మెదలు గ్రోలుచుండినవి. ప్రవరు డా మల్లెతీవెలను పట్టుకొని, అచ్చట నగుపించిన సోపానముల ననుసరించి కోనలోని కేగినాడు. ఆ సమీపములో నతడు

## 19

**తావుల్ క్రేవలఁజల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్**
**మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ**
**గ్రావాకల్పిత కాయమాన జటిలద్రాక్షాగుళుచ్ఛంబులన్**
**బూవుం దీవెల నొప్పు నొక్కభవనంబున్ గారుడోత్కీర్ణమున్.**

నలువైపుల సువాసనలు వెదజల్లుచున్న ఒక చెంగలువ కొలను. దాని తీరము నానుకొని మావులును క్రోవులును దట్టముగా పెనగొన్న యొకకాంతారము. అందలి చంద్రకాంత శిలా స్తంభములమీది పందిరినుండి వ్రేలాడు ద్రాక్షపండ్ల గుత్తులతో, పూవు దీవెలతో అందగించుచున్న ఒక గరుడ పచ్చల భవనము ప్రవరుని కంటబడినది. ఆశ్చర్యముతో అతడు కొంత ముందు కేగెను.

**మృగమద సౌరభవిభవ**
**ద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధ**
**స్థగితేతర పరిమళమై**
**మగువ పొలుపు దెలుపు నొక్కమారుత మొలసెన్.**

అంత ప్రవరునిపైకి గుప్పుమని యొక పరిమళవాయువు వీచినది. అది కస్తూరివాసనచేత రెట్టింపబడిన పచ్చకప్పురపు విడెము పరిమళము. ఆ పరిమళ మారుతము మగువల పొలుపును దెలుపుచుండెను. ప్రవరుడు ఆ వాయువు పరిమళ స్వభావమును గ్రహించినాడో లేదో కాని, అచ్చోటు జనాన్వితమని భావించినాడు. దాని ననుసరించి పోయి అత డొక మరున్నారీశిరోరత్నమును గాంచినాడు. ఆమె విద్యుల్లతావిగ్రహ, శతపత్రేక్షణ, చంచరీకచికుర, చంద్రాస్య, చక్ర స్తని, నవయౌవనవతి. ప్రవరుడు చూచిన గరుడపచ్చలు తాపిన భవన మా దేవలోకపు జవరాలిదే. దానిముందు తీయమామిడిగున్న. దాని నానుకొని యొక నున్నని మణులతిన్నె. తిన్నెమీద ఆ యన్నులమిన్న యాసీనయయి యున్నది.

## 20

**తతనితంబాభోగ ధవళాంశుకములోని**
**యంగదట్టపుఁ గావిరంగువలన**

**శశికాంత మణిపీఠి జాజువాఱంగఁగాయ**
**లుత్తుంగ కుచపాళి నత్తమిల్లఁ**
**తరుణాంగుళీధూత తంత్రీ స్వనంబుతో**
**జిలిబిలి పాట ముద్దులు నటింప**
**నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనుదోయి**
**రతిపారవశ్య విభ్రమముఁ దెలుపఁ**
**బ్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ**
**గ్రమకరపంకరుహరత్నకటకఝుణఝు**
**ణధ్వని స్ఫూర్తి తాళ మానములుగొలుప**
**నింపు దళుకొత్త వీణ వాయింపుచుండి.**

ఆమె తెల్లని సన్న వలిపమును ధరించినది. దానిలోపల ఎఱ్ఱని కావిరంగు అంగదట్టము (పావడ) కట్టినది. దాని అరుణకాంతి వలిపములో నుండి ఆమె యాసీనయైన చంద్రకాంతమణి వేదికమీద ప్రసరించి, దానికి పద్మరాగప్రభను ప్రసాదించినది. ఎంతటి సూక్ష్మపరిశీలన మీ మహాకవిది! నిశితమైన ఊహాశక్తి! ఆమె వాయించు వీణె సొరకాయ, లామె ఉత్తుంగ కుచపాళి నొత్తుకొని యొరయు చున్నవి. తన తరుణాంగుళములతో తంత్రులును మీటుచు కూనిరాగముతో పాడెడి జిలిబిలి పాట ముద్దులొలుకు చుండినది. రాగాలాపనము గొలుపుచుండి నది. నేర్పుమీఱ గీత ప్రబంధములను వీణెపై బలికించు చుండినది. ఇటు నటు వీణపై గదలాడు కరమునందలి రత్నకంకణములు ఝుణ ఝుణ మని ధ్వనించుచు పాటకు తాళము వేయుచుండినవి. ఇంపు దళుకొత్త నామె వీణ వాయింపుచు, నల కూబరుని వలె నున్న ప్రవరుని జూచినది. ఆమె కబ్బురపాటు కలిగినది. కన్నులు వికసించినవి, చన్గవ పులకించినది. మదిలో కోరికలు కొనలు సాగి నవి. అనిమేషత్వమును మాని చూపులు బిత్తర వోయినవి. మోహ విభ్రాంతి కలిగినది. అతడు తన్ను పరిగ్రహించిన మదనుని బంటుగా ఏల వచ్చునను కొన్నది. ప్రవరు డామె నచ్చట నట్లొంటరిగా నున్న దానిని జూచి యాశ్చర్య ముతో 'ఎవ్వతె నీవు భీతహరిణేక్షణ' యని పలుకరించి దీనముగ తన కథ యెఱి గించినాడు. తన పురము జేరు తెరు వెఱిగింపు మని కోరినాడు, అది విని యామె

యొడలు కంపించినది. సెలవివాఱ నవ్వి ఆమె నర్మగర్భముగా నిట్లు పలికినది.

## 21

**ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర, యే**
**కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా**
**గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవచొప్పు నీ**
**కింతభయంబు లేకడుగ నెల్లిదమైతిమి మాట లేటికిన్.**

ఈ పద్యమునందు భూసురేంద్ర, ఏకాంతము, భయంబు అను నవి మాత్రమే తత్సమ పదములు. తక్కిన వన్నియు తెలుగు పలుకులే. అవియును నిత్యవ్యవహారము నందలి మాటలే. పద. అర్థ, అన్వయ కాఠిన్యము లెవ్వియు నిందు లేవు. పద్యార్థము స్పష్టము.

ఓ బ్రాహ్మణుడా! ఇంత లేసి కన్నులు నీకుండగా దారి నెవ్వరి నడిగెదవు. ఏకాంతము నందున్న జవరాండ్రను పల్కరించుట కిదొక సాకేకాని వేఱుకాదు. కానిచో నీవు మునుపు వచ్చిన దారి నీ వెఱుగవా? ఏ మాత్రము భయములేక అడుగుటకు నీకు మేమింత చులక నైతిమా? ఇక మాట లెందులకు? అను అర్థము సామాన్యముగా వెంటనే స్ఫురించును. ఈ అర్థమును గ్రహించినచో, ఓయీ బ్రాహ్మణుడా! నీవు పోకిరివలె ఉన్నావు. ఇంత పెద్దకన్నులుండియు దారి అడుగుచున్నావు. ఇది ఒంటిరిగా నున్న జవరాండ్రను పల్కరించుటకు పన్నిన పన్నాగము. నీ దారి నీకు తెలియదా? మమ్ముల నిట్లడుగుటకు భయములేదా? నీకు మేమింత చులక నైతిమా? పలుమాట లేటికి? పోపొమ్మని ప్రవరుని మంద లించి చీవాట్లు పెట్టి నట్లుండును. ఇది యిందలి మాటల వలన తోచు పై పై అర్థమేకాని, ఈ మాటలు పలికిన వరూధిని అభిప్రాయ మిది కానే కాదు. అతనిని చూడగానే ఆమె చిత్తము మన్మథాయత్తమయినది. అతని అందమును పలు విధముల ప్రశంసించినది. అతడు తన్నంగీకరించిన మదనుని కూడ లెక్కచేయ నక్కఱ యుండదనుకొన్నది. కావున ఏకాంతమున తానుండగా నత డట్లు వచ్చి పల్కరించుట, అతడు తాను మున్ను వచ్చిన దారి యెఱుగకుండుట, ఒంటిగా నున్న జవరాలని కాని, దేవతాస్త్రీయని కాని భయములేక తన్నడుగుట, తాన త

నికి ఎల్లిద మగుట, అతడు తనతో మాటలాడుట అన్నియును ఆమె కిష్టములే. అంతే కాదు. ఆమె మనసార అత డట్లు చేయవలెనని కోరునట్టివే. అట్లయిన ఆమె యిట్లెందులకు మందలింపుగా పలికినది? కవితా రచనమున, ఇది మహా కవు లవలంబించు 'ధ్వనిమార్గము'; వ్యంగ్యపద్ధతి. ధ్వనియే కావ్యమున కాత్మ యని ఆలంకారికమతము. 'ప్రతీయమానః పునర న్యదేవ' అన్నట్లు ఈ ధ్వని మార్గము నందు వాచ్యార్థము (మాటలు తెలియజేయు అర్థము) కంటె భిన్నమ యిన వ్యంగ్యార్థ మొకటి యుండును. స్త్రీలకు అవయవముల కన్న భిన్నముగా లావణ్యమెట్లు భాసిల్లుచుండునో, అట్లే మహాకవుల కావ్యములందు, వాచ్యార్థము కంటె భిన్నముగా వ్యంగ్యార్థము భాసిల్లుచుండును. అట్టి వ్యంగ్యార్థము సహృద యుల హృదయములకు మాత్రమే విదితమగుచుండును; అని అలంకార శాస్త్ర కర్తల అభిప్రాయము. ఈ వ్యంగ్యము పలువిధములుగా నుండును. ఈ పద్యమునందలి వ్యంగ్యము ప్రకరణమును బట్టి స్ఫురించునట్టిది. వాచ్యార్థము మొకచో విధిరూపమున నున్న వ్యంగ్యార్థము నిషేధ రూపమున నుండును. (దీనితో ప్రస్తుతము మనకు పనిలేదు)

ఒకచో వాచ్యార్థము నిషేధ రూపమున నున్న, వ్యంగ్యార్థము విధిరూప మున నుండును. 'ఇంతలు కన్నులుండ' అను పై పద్యము నందలి వరూథిని మాటలలోని వ్యంగ్య మిట్టిదే. దీనిని స్పష్టపఱచుటకు వేఱొక యుదాహరణము చూపబడు చున్నది.

"ఇచట మా యత్త పండు, నేనిటఁ బరుండుఁ
బగటనే లెస్సగని గుర్తు పట్టుకొమ్మ
రేయి చీఁకటిఁ గానక యోయి పాంథ!
పడకుమీ! మాదు మంచాలపైనిఁ దప్పి."

ఈ మాటలు భర్త ప్రవాసమునందున్న యొక నాయిక, ఇంటికి వచ్చిన పాంథునితో అన్నవి. ఇందు "మాదు మంచాల మీద పడకుమీ" అని వాచ్యార్థము నిషేధరూపమున ఉన్నది. వ్యంగార్థ మిందు విధిరూపమున నుండును కావున "పాంథుడా! పగటివేళనే మా మంచాలను బాగుగా జూచి, నా మంచము గుర్తుంచు కొని, నా మంచము మీద పడుము" అనునది వ్యంగ్యార్థము.

ఇట్లే పై పద్యము నందలి వరూధిని మాటలు 'మాటలేటికిన్' అనగా 'మాతో నీకు మాట లెంచులకు, చాలువొ' మ్మన్నట్లు నిషేధరూపమున నున్నవి కాబట్టి, ఇందుకు భిన్నముగా "నేను ఏకాంతమునం దున్నాను. జవరాలను. ఏ మాత్రము భయము లేక మాతో మాటలాడుచు (సరస సల్లాపములు సలుపుచు) ఇచ్చట ఉండి పొమ్ము." అని ఇచ్చటి వ్యంగ్యార్థము. ఇది విధిరూపమైనది. కావ్యముల బట్టి వ్యంగ్యార్థములు చమత్కార జనకము లగు చుండును.

'ఇంతలు కన్నులుండ' అను పై పద్యమునందు కవి, వంచినట్లు వంగునట్టి, మలిపినట్లు మలగునట్టి, అతికినచోట అతుకునట్టి మైదాపిండి ముద్దలవంటి మెత్తమెత్తని చిన్నచిన్న మాటలను కూర్చినాడు. కాబట్టి ఇందలి మాటలను వాక్యములను వేఱువేఱుచోట్ల ఆపి చదువుటచేత, అనేక ఇష్టార్థములు సిద్ధించు అవకాశమెట్లుకలదో సూచింపబడుచున్నది. కొన్నిచోట్ల కాకువుచేతను, శ్లేషచేతను గూడ నిట్టి యర్థము లేర్పడును. తెరు వెవ్వరివేడెదు భూసురేంద్ర! అనుదానిలో 'అడిగెదు' అను మాటకు ఓ బ్రాహ్మణుడా! నీవు వేడుకొన్నను మీయూరికి దారి తెలుపువారెవ్వరును లేరనిభావము. 'నెపంబిడి పల్కరించులాగు; ఇంతియెకాక నీ వెఱుగవే మును వచ్చిన త్రోవచొప్పు'—, ఏదో ఒకత్రోవ నెపము పెట్టుకొని మమ్ము పల్కరించులాగే (అనగావిధము అని); ఇదినిజము.కాదేని, 'ఇంతియెకాక నీ వెఱుగవే...చొప్పు—, ఇంతి అనగా స్త్రీ, కాదు ఒకవేళ ఏ స్త్రీయైనను తాను మున్ను వచ్చినదారి నెఱుగనన్న నమ్మవచ్చును కాని, నీవు పురుషుడవు, ఇంతలు కన్నులున్నవాడవు; మునువచ్చినదారి నెఱుగవనిన ఎవ్వరు నమ్ముదురు ? అని భావము. కావున నీది దారి నెపమున ఏకాంతమునందున్న జవరాండ్రను పల్కరించు లాగే అనుటకు సమర్థనము ఏకాంతము...నెపంబిడి పల్కరించు లాగింతియ! ఒంటరిగానున్న జవరాండ్రను పల్కరించు నీలాగు (పద్ధతి) ఇంతేనా ? అనగా మమ్ము దారిగాక మరేదైనా అడుగలేవా? అని;—'కాక' అనగా వేడిమి, మదన తాపము; ఇంతలు కన్నులున్న అందకాడవు-ఏకాంతమునందు జవరాలను నే నెదుట నున్నను కాక నీవెఱుగవే? అనగా నీకు మదనతాపము తెలియదుకదా అయ్యో! అని—, ఏ + మునువచ్చిన + త్రోవ చొప్పు + నీ వెఱుగవు, అని విడదీసినచో, నేను దూరముగా నున్నంతవరకే ఈ నీ బింకము. నీవు మునువచ్చిన త్రోవ చొప్పెఱుగ ననుచున్నావు.నేను 'ముసు' అనగా నీముందుకువచ్చి నిలిచిన నిన్ను

నీవే మఱచి, నీవు మునువచ్చిన త్రోవ చొప్పు నిజముగనే ఎఱుగజాలకుందువు సుమా అని —, ఒకవేళ నన్ను త్రోసిపుచ్చి పోవలె ననుకొన్నను అదియును సాధ్యముకాదు. నావెంట రంభాదులు చెలులు పెక్కురు కలరు ఏమును = మే మందఱము వచ్చినచో త్రోసిపోవ నీకుసాధ్యముగాదు. అది చమత్కారము (తనపై బడి కౌగలించిన వరూధినిని ప్రవరుడు అంసద్వయం బంటి పొమ్మంచు త్రోసి పోయినాడు. కావున ఇట్టి యూహకు అవకాశముకలదు) –, కావున నిన్ను ఎల చిన జవరాలను, ఏకాంతమునందున్నాను. కాబట్టి నెపంబిడి పల్కరించులా గింతియకాక; అనగా నెపముతో పల్కరించు విధమింతటిదే అగుగాక ! కావున ఈ నీ నెపముతో పల్కరించువిధమునకు స్వస్తిచెప్పి, ఇంత భయంబులేక + అడుగ + నీకు + ఎల్లిదమైతిమి + మాటలేటికిన్–, ఇంకా పలు మాటలెందులకు? ఏమాత్రము భయములేక ఏదేని అడుగుటకు నీకు నేను (ఎల్లిదమైతిమి) సులభు రాలనైతిని సుమా ! మాటలేటికిన్ - ఈ వట్టిమాట లెందులకు ? అని వరూధిని పల్కిన నర్మగర్భపు మాటలలో అప్పటి అమె మనసులో 'అరచాటగు ఆంధ్ర వధూటి చొక్కపుం జనుగవలీల' దృశ్యాదృశ్యముగా, వ్యక్తావ్యక్తముగా నున్న భావపరంపర సూక్ష్మముగా తరచి, అరసిన కొలదిని మనకు భాసించు చుండును. కావుననే 'పెద్దనవలె కృతిజెప్పిన పెద్దనవలె', 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' అను ప్రశంసలు పుట్టినవి. "చతురవచోనిధి...ఆంధ్రకవితా పితామహుడ వెవ్వ రీడు పేర్కొన నీకున్" అని ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయలు పల్కిన ప్రశంసా వాక్కులు ప్రత్యక్ష సత్యములు కదా! పెద్దన ప్రబంధ కవులకు నిజముగ పెద్దనయే. మనుచరిత్రము చిరకాలము మనుచరిత్రమే. ధర్మదాంపత్యధర్మము నుపదేశించుట కుద్దేశించి రచింపబడిన అది మనచరిత్రమే.

## 22

**బహురత్నద్యుతి మేదురోదరదరీ భాగంబులం బొల్చు ని**
**మ్నగహాహార్యమునన్ జరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ**
**లహరీశీతల గంధవాహ పరిఖేల న్మంజరీసౌరభ**
**గ్రహణేందీవరతుందిలంబు లివి మత్కాంతారసంతానముల్.**

ఈ పద్యమున వరూధిని తన ఐశ్వర్యవైభవమును ప్రవరునికి ఆత

డువ్విళ్ళూరు ననుకొని చెప్పుచున్నది. పాపము! అతని వైరాగ్య పాకము నామె యెఱుగదు. రత్నకాంతులతో నిండిన ఈ హిమాలయపు గుహలు మాకు విహార స్థలములు. అవి మా కేళివనములు. ఆకాశగంగనుండి వచ్చు చల్లని కమ్మని గాలితో సయ్యాటలాడు మా ఉద్యానము నందలి పూగుత్తుల పరిమళమును ఆసించి, తుమ్మెదలు తిరుగాడు చుండును (నాతో నిట నుండిపోయిన నీవు వీని ననుభవింపవచ్చునని యామే ఇట్లు చెప్పుటయందలి అభిప్రాయము).

ఈ పద్యమునందలి పదవిన్యాసమును, పెద్దనగారి సంస్కృత సమాస చాలనా సామర్థ్యమును ముఖ్యముగా గమనింపదగియున్నవి. ఈ దీర్ఘ సంస్కృత సమాసమును ఇందలి పదములును నభోవాహినీ లహరుల ఊగిసలాటను మరియు మంజరీ సౌరభముల నీను చున్నవి. 'గ్రహణేందీవరేత్యాది చివరి చరణము బిందు పూర్వక' 'ద'వర్ణ'త'వర్ణ సంఘటితమై సౌకుమార్యగుణసంపన్నమై పద్యమునకు సంగీతగుణమును సంతరించు చున్నది.

## 23

**ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁబోయెద నంచుఁ బల్కెదీ**
**వక్కట! మీకుటీర నిలయంబులకున్ సరిరాక పోయెనే**
**యిక్కడి రత్నకందరము, లిక్కడి నందన చందనోత్కరం**
**బిక్కడి గాంగ సైకతము, లిక్కడి యాలవలీ నికుంజముల్.**

ఈ పద్య నిర్మాణమునకును 'బహు రత్నద్యుతి' అను పై పద్య నిర్మాణమునకును, రెండింటి శైలికిని ఎంత భేదమున్నది! అందు కడు దీర్ఘ సమాసము, ఓజోగుణము. ఇందు దీర్ఘ సమాస మొక్కటియు లేని అల్పాల్ప సమాస రచన, మాధుర్య గుణము. పెద్దన రచనా చమత్కారము నందలి రహస్య మిది. ఒక పద్యము నందలి రచనా విధాన మింకొక పద్యమునందు సాధారణముగా నుండదు. ఏ పద్యము సొగసు దానిదే. ప్రతిపద్య మొక ప్రత్యేక రచనా శిల్పముతో నొప్పారు చుండును. కవితాత్మలేని సామాన్య విషయము చెప్పవలసి వచ్చినపుడు పద్యము ప్రథమార్థమును పొడి పొడి మాటలలో చెప్పి, ద్వితీయార్థము నొక లయ ప్రధాన మయిన దీర్ఘ సమాసముతో కూర్చి పఠితల మనస్సును

బట్టి ఒక్క ఊపు ఊపును. ఉదాహరణమునకీ క్రింది కందమును జూడుడు. హిమాలయము నందలి సుందర దృశ్యములు కొన్ని పరికించుచు ప్రవరుడు,

## 24

పరికించుచు డెందంబునఁ
బురికొను కౌతుకముతోడ భూమీసురుఁడ
గ్గిరికటకతట నిరంతర
తరుగహనగుహావిహారతత్పర మతియై.

ఈ పద్యమున భావముగాని తదావేశముగాని లేదు. ప్రవరుడు హిమాలయముపై విహరింపగోరె ననుట యిందలి విషయము. కాని, దానిని చెప్పిన పద్ధతి దానికి పద్యరూపముతో పాటు పద్యగుణమును ప్రసాదించినది. దానిని మరల మరల జదివించుచున్నది, ఇందలి ర,క,ట,త,గ,హ వర్ణముల పునరావృత్తులు ఈ పద్యమునకు సంగీత గుణము నాపాందిచుచున్నవి. ఇందలి 'కటకతట' అను పదబంధము వీణతంత్రులను గోటమీటినట్లు వినిపించుటేకాక, 'తకిట తక' అను మృదంగధ్వనిని ప్రతిధ్వనించు చున్నది కదా! పెద్దిన చతుర రచనా శిల్పమిట్టిది. ఇట్లే.

## 25

పరిపరి విధంపు జన్నంపుఁ బరికరంపు
సొంపు సంపద నిఖల నిలింప సభయు
నప్పటప్పటికిని జిహ్వా త్రుప్పు డుల్ల
నామెత లెఱింగె నీ తుషారాద్రి కతన.

ఈ పద్య భాగమునందు భావము బొత్తిగా లేదనలేము. కాని, యిది పద్య మనుటకు కారణము భావము కంటె ఇందలి రచనా విధానమే. బిందు పూర్వక 'ప' వర్ణము యొక్క పునః పునరావృత్తి యిందలి మొదటి రెండు పాదములకు వీణానాద సామ్యత్వమును, మూడవ పాదము నందలి 'అప్పటప్పటికిని జిహ్వాత్రుప్పు' అను కూర్పు మృదంగ వాద్య సామ్యత్వమును వానికి సంపాదించి పెట్టినవి.

## 26

సద్యోవినిర్భిన్న సారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కసటుపోఁ బిండఁ గరఁగఁ కట్టల నంటి
గమగమవలచుఁ జొక్కపుజవాజి
పొరలెత్తి ఘనసార తరువులఁ దనుదాన
తొరఁగిన పచ్చకప్పురపు సిరము
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంపు
దొనల నిండినయట్టి తుహినజలము
వివిధ కుసుమ కదంబంబు, దివిజతరుజ
మృదులవసన ఫలాసవామేయరత్న
భూషణంబులు గల విందు భోగపరుఁడ
వయి రమింపుము నన్నుఁగూడి యనుదినంబు.

ఈ పద్యము నందు పెద్దన కనబఱచిన చతురరచనాశిల్పము అనన్యము. అపూర్వము. నాన్యతోదృశ్యము. ఈ ఒక్క పద్యమే పెద్దన మహాకవి ఆంధ్ర కవితా పితామహ 'బిరుద నామమును సార్థకము చేయ జాలియున్న దనిన యధార్థమే యగును. అల్లసానివాని 'యల్లిక జిగి బిగి' ఇందు పరాకాష్ఠ నంది యున్నది. విజయనగర పాలకుడగు శ్రీకృష్ణ దేవరాయ సార్వభౌముని సాహ చర్యమున రాయలతో పాటు పెద్దన యనుభవించిన భోగములలో మేలేర్చి యిందు పొందు పఱచినాడు. విద్యానగరపు వేశ్యాజనము గూడ నా డనుభవిం చిన భోగ్య వస్తుసామగ్రితోనే పెద్దనగారి వరూధిని యిందత్యంతాభినివేశముతో ప్రవరు నూరించి ప్రలోభ పెట్ట యత్నించినది. [పెద్దన హిమాలయము నందు చేసిన వర్ణనములలో మనకు అసంభవముగా తోచునవి, నిజముగా నాటి విద్యా నగరము నందలి రాజ ప్రాసాదమునందును, రాయల శృంగార వనము నందును ఇతరత్ర కూడ పెద్దన స్వయముగా చూచి స్వానుభవముతో చేసినవే అని మన మూహింపవచ్చును. కోనలోనికి పెద్దన నిర్మించిన మణి పట్టభంగసరణి, వరూధిని గారుడోత్కీర్ణభవనము. అట నున్న ఐందవ గ్రావాకల్పిత కాయమాన

జటిల ద్రాక్షాగుళుచ్ఛములు, వరూధిని వస్త్రధారణ విధానము, ఆమె వీణవాయించిన తీరు మున్నగునవిట్టివి.].

ఈ పై సీసము నాల్గుపాదములును ఒకే తూకము గలిగి సమతాగుణ సమన్వితములుగా నున్నవి. వీనియందు పచ్చకస్తూరి, అచ్చ జవ్వాజి, పచ్చ కప్పురము, గొజ్జగిపూల పన్నీరములను కవి ముఖ్యముగా వర్ణించినాడు. వీనికి విశేషాంశములుగా కవివాడిన 'సద్యోవినిర్భిన్న' ఇత్యాదులును, పిసాళించు, గమగమవలచు, పొరలెత్త తనుతాన తొరగిన, మున్నగు క్రియాపదములు, హేమకంకణమున పొదగిన అనర్ఘమణులవలె, వెంట్రుక వాసిమందమును తమ స్థానముల నుండి కదల్పరాని విధమున, 'జిగిబిగి' పనితనము మీఱ ఈ నాల్గుపేటల పద్యహారములో బిగింప బడినవి. ఈ పాదములందు మృగమదము మున్నగు వస్తువులు సమకూరుటకు చెప్పబడిన విధానములు కాలవ్యవధి నపేక్షించునవి. సారంగనాభిని భస్మముచేసి కస్తూరి నాహరించుటకు కొంత వ్యవధాన మవసరము. ఇట్లే జవాజి మున్నగువానికిగూడ నూహింపవలెను. ఈ వ్యవధానమును తెలియజేయుటకు ఈ సీసపాదములందు సముచిత పదప్రయోగముచేత వానికి మత్తేభ మందగమనమును కల్పించినాడు. ఇందలి గీతమునందు కవి కుసుమ కదంబములతోపాటు కల్పవృక్షములనుండి సంకల్పమాత్రమున అప్పటికప్పుడే సమకూరు 'పసనఫలాసవామేయ రత్నభూషణము' లనునట్టి ఉదాత్త వస్తుసామగ్రిని వర్ణించినాడు. వీని సంపాదనమునకు వ్యవధాన మవసరములేదు. కావున కవి వీనిని దివిజతరుజ...వంటి దీర్ఘసమాసమున ఝటితిస్ఫూర్తి కలుగునట్లు చెప్పినాడు. ఇట్లు చెప్పుట ఈ కవితాశిల్ప చమత్కారము.

"ఆటఁజనికాంచె భూమిసురుడు..." వంటి దీర్ఘ సంస్కృత సమాస భూయిష్ఠములయిన పద్యములందలి రచనాసౌందర్యము వెంటనే కొట్టవచ్చినట్లు కనిపించును కాని ప్రస్తుత 'సద్యోవినిర్భిన్న...' ఇత్యాది సంస్కృతాంధ్ర పద సమాసములతోడి మిశ్రమ రచనలందును, కేవలము తెలుగు పలుకుబళ్ళతోడి కొన్ని రచనలందును, పెద్దనామాత్యుని 'పనితనము' బహువారపఠన మనన ములచేత గాని సహృదయ హృదయగమ్యముకాదు. భావ భాషా పదప్రయోగ శబ్దార్థాలంకార వైచిత్రియో రీతి గుణపాకశయ్యాసౌభాగ్యాదులలో, లోకోక్తియో

నుడికారమో, ఉక్తి వైచిత్రియో ఏదో యొకటి లేని రచన మనుచరిత్రమున దుర్లభమే.

## 27

**ఎన్ని భవంబులం గలుగు నిక్షురాసన సాయకవ్యథా**
**ఖిన్నత వాడి వత్తలయి, కేలఁగపోలము లూఁది, చూపులన్**
**విన్నఁదనంబు దోపఁ గనువేదురునన్ బయి గాలిఁసోఁకినన్**
**వెన్నవలెం గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చుభాగ్యముల్.**

పెద్దన పద్దెము దేని కదియే సాటి. ఆయన శిరీషకుసుమపేశల సుధా మధురోక్తుల తోడి ప్రశస్తరచనమిది. ఇందలి పదమార్దవము, భావమాధుర్యము, శయ్యా సౌభాగ్యాదులు హృదయైక వేద్యములు. 'పైగాలిసోకినన్ వెన్నవలెంగరంగు నలివేణులఁ గౌఁగిటఁజేర్చు భాగ్యములు ఎన్నిభవంబు లనెందరకు గలుగునో చెప్పుట కష్టమే. కాని, పెద్దన గారి ఈ పద్యపు గాలి సోకగనే, రసిక పాఠక మహాశయుల మనస్సులు ఈ భవంబుననే ఇప్పటి కిప్పుడే వెన్నవలెఁ గరంగు ననుట అనుభవసిద్ధమే. పెద్దన కవితావాణిని బుద్ధిబాహువుల బంధించి మనః పరిష్వంగము చేయుభాగ్యము, మనుచరిత్రయందలిర చనల ననుదినము మననము చేయు మనస్వులది కాక మఱి యెవరిది? మనుచరిత్రమును పెద్దన రచించుట మనభాగ్యమే !

## 28

**ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్**
**జెందున్ గుంభగత ప్రదీపకళికా శ్రీ దోపఁ నెందెందుఁబో**
**కెందే నింద్రియముల్ సుఖంబుఁగను నాయింపే పరబ్రహ్మ "మా**
**నందో బ్రహ్మ" యటన్న ప్రాఁజదువు లంతర్బుద్ధి నూహింపుమా.**

అత్యంత ప్రసిద్ధములైన పెద్దన పద్యములలో పేర్కొనదగినది ఇది ప్రవరుని గాఢముగా మోహించిన దేవ వేశ్య యగు వరూధిని 'బ్రాహ్మణు డింద్రియవశగతి...బ్రహ్మానందైక రాజ్యపదవీచ్యుతుడై' చెడు నన్న యతని వాదముతోనే యతని జయించి లోఁబఱచుకొనగోరినది. "ఆనందో బ్రహ్మ"యను

వేదోపనిషద్వాక్యమునకు 'విషయానందమే బ్రహ్మానంద' మని చేసిన విపరీత వాద ధోరణిని ఇందు పెద్దన సముచితపద్ధతిలో ఆవిష్కరించినాడు. భాషా పర శేషభోగియు, అనారత వేదాధ్యయనతత్పరుడునయిన ప్రవరునివ రూధిని ప్రాజ్ఞ దువుల సంతర్బుద్ధి నూహింపుమన్నది. అట్లనుట హనుమంతుని ముందు కుప్పి గంతులు వేసినట్లున్నది. కావుననే అతడు నిస్పృహత దెలుపు ఒక్క చిఱు నవ్వు నవ్వి,

## 29

**ఈ పాండిత్యము నీకుఁదక్క మఱియెందేఁ గంటిమే! కామశా**
**స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మే లోహో త్రయీ ధర్మముల్**
**పాపంబుల్ రతి పుణ్యమంచు, నిఁక నేలా తర్కముల్ మోక్షల**
**క్ష్మీపథ్యాగమ సూత్రపంక్తి కివెపో మీసంప్రదాయార్థముల్.**

ఆమె విపరీత పాండిత్యమును అధిక్షేపించినాడు. "వేద ధర్మములు, పాపములు, రతి పుణ్యమని కామశాస్త్రోపాధ్యాయిని వలె వచించుచున్నావు. మోక్షమార్గమును బోధించు వేదాంతసూత్రములకు ఇవి మీ కాముక సంప్రదా యార్థములు కాబోలు !"అని యెత్తి పొడిచినాడు. మీసాలపై తేనియలవంటి ఇట్టి తుచ్ఛ సుఖములను గూర్చి యిక నాకు చెప్పకుమన్నాడు. ఆ మాటలు విని వరూధిని "వనిత తనంత తా వలచి వచ్చిన చుల్కనగాదె యేరికిన్" అని మనస్సులో బాధపడినది. పెద్దన చెప్పిన పై వాక్యము తెలుగు నాట నేటికి సామెతగా నిలిచిపోయినది. వరూధిని కామతాపము నాపుకొనలేక, నిలుచున్న పాటున తటాలున సతనిమీద వ్రాలినది. కౌగలించి యతని అధరము నాశించినది.

## 30

**ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై**
**యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప, హా! శ్రీహరీ**
**యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి. తదీయాంసద్వయం బంటి పో**
**మ్మంచున్ ద్రోచెఁ గలంచునేఁ సతులమాయల్ ధీరచిత్తంబులన్.**

ప్రవర వరూధినుల వృత్తాంత రసవ దేకాంకనాటికకీ పద్య మించుమించు భరతవాక్యమువంటిది. శృంగార వైరాగ్యముల కిది అంతిమ సంఘ

ర్షణ. ప్రవరుని అకాముకతకు, అతని ధీరత్వమున కిది అగ్నిపరీక్ష. రతి విరక్తులకు, నిధువన నిర్వాణములకు, విషయానంద బ్రహ్మానందములకును పరస్పర జయాకాంక్షతో నిర్విరామముగా సాగెడి సంగ్రామమున గెలుపోటముల విషమసమస్యా పరిష్కారనిర్దేశ విచిత్రఘట్టమిది!

వరూధిని ప్రవరునిపైబడి కౌగలించినది. శృంగారము వైరాగ్యము నాక్రమించినది. రతి విరక్తిని క్రమ్మినది. విషయానందము బ్రహ్మానందమును బిగబట్టినది. శృంగారరసాధి దేవతయైన మదనునకు మధుమాస కుసుమ శుక భ్రమరాదులవలె, వరూధినికి ప్రాంచద్భూషణములు, బాహుమూలరుచులు పొంగారు పాలిండ్లు, మొనలు దీరిన వానియంచులు విజయ సాధనములు. ప్రాంచద్భూషణకాంతులతో బాహుమూల రుచులతో నామె ప్రవరుని కన్నులు మిరుమిట్లుగొలిపి, పాలిండ్లతో నదిమి చనుమొనలతో ప్రవరుని ఱొమ్మును గ్రుమ్మినది. అతడామె కౌగిట బందీగా నున్నాడు. అతని పెదవిని తనపంట నొక్కనుంకించి ఆమె యధరం బాసించినది. అధరమానుట శృంగార సంగ్రామమున ఎదిరిని చిత్తుచేయుట వంటిది. వరూధిని అతని యధర మాసించి తన విజయమును విశ్వసించినది. శృంగారము వైరాగ్యమును ఓటమిని ఒప్పు కొమ్మని సవాలు చేసినది. ధీరత్వవిరాగములే ప్రవరునికున్న సంపత్తి. అతడు తాను ప్రమాద స్థితిలో నున్నట్లు గ్రహించినాడు. చేయునదిలేక తన ఉపాస్యదైవ మును. 'హా! శ్రీహరీ' నన్నీప్రమాదస్థితినుండి రక్షింపుమని, మొసలినోట జిక్కిన గజేంద్రునివలె శరణు జొచ్చినాడు. అతనికి క్రొత్తబలము కలిగినది. కర్తవ్యజ్ఞా నము కార్యము నుపదేశించినది. ఆమెదేహము తనదేహమును తనిలోనికి పొదుగు కొని యున్నది. ఆమె ముఖముకూడ తన ముఖము నాక్రమింప విక్రమించు చున్నది. తటాలున తన మొగము ప్రక్కకు దిప్పుకొని ప్రమాదమునుండి తప్పు కొన్నాడు. దేహమింకను ఆమె కౌగిట చిక్కుకొని యున్నది. రెండుచేతుల నామె భుజము మీద తటాలున మోపి త్రోసి పడవేసినాడు. ఇట్లు దేహవిముక్తిని పొంది యెక్కటి పోరాటములో ఒక్కుమ్మడిగా ఒంటరికాడయి నెగ్గినాడు. తన్నావ రించిన కామరూపిణిని పొమ్మని గద్దించినాడు. శృంగారమోడినది. వైరాగ్యము గెలిచినది.

పై పద్యము చివర పెద్దన 'పొమ్మంచుం ద్రోచెఁ గలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్' అను అర్థాంతరన్యాసమును చేర్చి ప్రవరుడు చేసిన పనిని సమర్థించినాడు. ధీరుల చిత్తములను సతుల మాయలు కలంచునే? అనగా కలవర పఱచ జాలవని భావము.

కలంచునే అను దానిని కల + అంచు (అనుచు,)నే అని గ్రహించుటకు వీలున్నది. కల అనగా స్వప్నము కావున, వరూధిని తన్ను కౌగలించుట మున్నగు నదంతయు ఒక పీడకల వంటిదని భావించి, వరూధినిని త్రోసి పుచ్చె నను భావము సిద్ధించును. అపుడు 'సతుల మాయల్' అనుదానికి సతుల యొక్క మాయ లనికాక, ధీరుల చిత్తములందు సతుల అనగా 'సతులే మాయ' అను అర్థము వచ్చును. కలచున్ + ఏ సతుల మాయల్ అని విడదీసినచో, ఏ సతులనగా సామాన్య మానవస్త్రీలే కాక వరూధిని వంటి దేవతాస్త్రీల మాయలుకూడ కలవరపెట్టజాల వను అర్థము స్ఫురించును. ఈ యర్థమున ఏ సతుల మాయల్ ధీరచిత్తంబులన్ కలంచున్? అని ప్రశ్నార్థక వాక్య మేర్పడును. ఇందు ప్రవరుడు త్రోసి పొమ్మన్నది వరూధినిని కాదు, తన్నావరింప యత్నించిన శృంగారలీలను, ప్రబల కామమును, తన్ను బ్రహ్మానందాధిరాజ్యపదవీ చ్యుతిని గావించి చెఱుప వచ్చిన 'సతిరూప మాయ' నని గ్రహింపవలసి యుండును. ఈయర్థమున వరూధిని వరూధినికాదు. మూర్తీభవించిన కామము. ప్రవరుడు ప్రవరుడుకాడు. మూర్తీభవించిన వైరాగ్యము, వేలిమి, సురార్చన, విప్రసపర్య, వేదాధ్యయ నాధ్యాపనములు అనునట్టి నిర్మల వైదిక ధర్మానుష్ఠానాదుల వలన సిద్ధించిన ఇంద్రియ నిగ్రహ వైరాగ్యముల చేత, తన్నావరించి లోబఱచుకొన యత్నించిన కామమోహరూపమాయను జయింపగలిగె ననుట. ఇదివరూధినీ ప్రవరవృత్తాంతము నందలి అభ్యాసరూప వస్తు రూప ఉపదేశము. మనుచరిత్రము నందలి ప్రధానా ప్రధాన కథలన్నింటి చేతను కవి కామముయొక్క భిన్నదశలను భిన్నరూపములను విమర్శించినాడు. ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములు సక్రమ సాధన, మార్గ ములని నిరూపించినాడు. బ్రహ్మచర్య వాన ప్రస్థాశ్రమములను దిఙ్మాత్రముగ తల స్పర్శగావించినాడు. గృహస్థాశ్రమ శ్రేష్ఠత్వమును, దాంపత్యమునందలి వివిధదశ లను స్వారోచికథచేత విమర్శించి ప్రవర వృత్తాంతముచేత ధర్మదాంపత్య స్వరూప

మును నిరూపించినాడు. అట్టి ధర్మదాంపత్యమే శ్రేష్ఠతమ మనియు, ఆచరణ యోగ్యమనియు, వస్తురూపముగను, కొన్నియెడల కంఠోక్తిగను పెద్దన ఉపదేశించి నాడు. ఈఉద్దేశసాధనకే మనుచరిత్ర రచనము జరిగినది. అందుకవికృత కృత్యు డయినాడు. కొందరిడి కేవలశృంగారప్రబంధమని భ్రాంతిచెందుదురు కాని అది సరికాదు.

వైద్యుడు రోగియొక్క ఆరోగ్యమును గోరి తేనె అనుపానముతో చేదు మందులను రోగికి తెలియకుండ త్రావించి రోగవిముక్తిని కావించును. కేవల హితోపదేశము లెట్టివైనను విని తలయూపుదురే కాని మనస్సు కెక్కించుకొని ఆచరింప సాధారణముగా నిష్టపడరు. కావున శృంగారము, శిరీషకుసుమ పేశల సుధామయోక్తులు, చతురరచనము మరియు రసవదాఖ్యానములను నాల్గు అనుపానములతో, గృహస్థాశ్రమధర్మ ధర్మదాంపత్య శ్రేష్ఠత్వ సందేశోపదేశములను కట్వౌషధమును మనుచరిత్ర ప్రబంధమున మధుర రసాయనముగా మార్చి మన కందించినాడు. ఈ సాహిత్యభిషక్కు పెద్దన.

అట్లు ప్రవరునిచే త్రోసివేయబడిన వరూధిని ఒడలు, గొంతు సవరించు కొని అతనిని చుఱచుఱఁజూచుచు ఇట్లు పలికి ఏడ్చినదట !

**31**

**పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ ని**
**చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచు జూపియ**
**ప్పాటలగంధి వేదన నెపం బిడి యేడ్చె గలస్వనంబుతో**
**మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల నఖులు చిందు వందఁగన్.**

ఓయీ! దయలేనివాడా ! నీవు భుజములంటి త్రోయగా ఇదిగో యిచ్చోట నీ కొనగోరు సోకి గాయమైనది చూడు మని తన వక్షోజ సౌందర్య మాతని కనులకు బాగుగా నగుపించునట్లు తన రెండు భుజములు చూపించినది. పాటు నకు ఇంతు లోర్వగలరా ? ఇవెక్కడి మోటు సరసములని బాధను నటించుచు ఆ పాటలగంధి కలస్వనముతో, గోటమీటిన విచ్చిపోవునటు లున్న గుత్తపు చను

మిట్టల నఖశులు చిందిపడుచుండగా నేడ్చినది. ఈ వరూధిని రోదనము సకార ణమై స్త్రీజనక స్వభావోచితముగా నున్నది. ఈ రోదన పద్యము, తర్వాతి ప్రబంధకవులకు ఒజ్జబంతియైనది. ప్రబంధములందు నాయికారోదనవర్ణన మొక పద్యమున జెప్పుట సంప్రదాయమైవది. ఈ విషయమున ప్రబంధకవు లొకరితో నొకరు పోటీపడి పద్యములు రచించినారు. ఈ పెద్దన పద్యమువలెనే తిమ్మన రామరాజభూషణుల రోదన పద్యములు కూడ ప్రసిద్ధికెక్కినవి. తిమ్మన సత్యభామ రోదనము నిట్లు వర్ణించినాడు.

ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలియేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాల పల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వనిన్.

ఈ క్రిందిది రామరాజభూషణుని గిరికారోదన పద్యము –

ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక, రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి, యెల్గెత్తి, యా
రాజీవానన యేడ్చెఁ, గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళ విపంచికా రవ సుధాపూరంబు తోరంబుగాన్.

ఈ మూడు పద్యములు క్రమముగా నొకదాని కొకటి పెంపుదలగా గోచ రించుచున్నవి. వరూధిని చనుమిట్టల నఖశులు చిందగా నేడ్చినది.సత్యభామ కషాయ కంఠకలకంఠ వధూకలకాకలీధ్వనితో ఏడ్చినది. రామరాజభూషణుని గిరిక కాంభోజీ మేళవిపంచికారవ సుధాపూరంబుతోరంబుగా నేడ్చినది. ఈ పద్యము లను జదివిన పూర్వ విమర్శకులు అల్లసాని పెద్దన అట్లట్లేడ్చెననియు, ముక్కు తిమ్మన ముద్దుముద్దుగానేడ్చెననియు, భట్టు మూర్తి బావురుమని యేడ్చెనని యభి ప్రాయపడినారట !

## 32

**ఎంత తపంబు సేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్**
**కాంతుఁ దవజ్ఞ సేసినను గాయము వాయుదు, రే నమర్త్యనై**

**చింతల వంతలం జివికి సిగ్గరితిన్ మృతిలేని నాదు చె**
**ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా !**

తాను వలచిన మానవ సుందరుడు తన్ను తిరస్కరించిపోయిన అనంతరము, మరణ స్వాతంత్ర్యముగల మర్త్యభామినులే నోచి పుట్టినవారనియు, చావులేని తన చెలువము పాడుబడిన యింటిలో వెలిగించిన దీపమువలె పనికిమాలినదయినదని, వరూధిని విచారించినవిధ మిందు భావానుకూలమయిన మెత్తని పదములతో ప్రకటింపబడినది. చివరిపాదమునందలి 'శూన్యగేహమున కెత్తిన దీపిక' యను న్యాయము ఈ పద్యగేహమున కెత్తిన దీపికవలె నున్నది.

ఈ క్రింది సాయంసంధ్యావర్ణనము మనోహరముగా చేయబడినది.

**33**

**ఉరుదరకుహర సుప్తోత్థశార్దూలముల్**
**ఝురవారిశోణిత శంకఁ ద్రావ**
**వనకుంజమధ్యశాద్వలచరన్మృగపంక్తి**
**దావపావకభీతిఁ దల్లడిల్ల**
**నాశ్రమాంతరభూరుహాగ్రముల్ మునికోటి**
**బద్ధకాషాయవిభ్రాంతిఁ జూడ**
**ఘనసానుశృంగశృంగాటకంబులఁ గాంచి**
**యమరులు హేమాద్రి యనుచు వ్రాలఁ**
**గాసెఁ బేశలరుచిఁ గింశుకప్రవాళ**
**ఘుసృణకిసలయకంకేళి కుసుమగుచ్ఛ**
**బంధుజీవజపారాగ బాంధవంబు**
**లన్నగంబున జరఠారుణాతపములు.**

సూర్యుడు ప్రొద్దున బాలుడు, పగలు యువకుడు, మాపటింతల వృద్ధుడు. కావున ఆతని కిరణములుగూడ పగటి వేడిమిని వెలుతురు గోల్పోయి, సాయం

కాలమునకు ముదురుపాటి, ఎఱ్ఱవాటి, చల్లవాఱును. కావున పెద్దన హిమాద్రిమీద జరఠారుణాతపములు కింశుక ప్రవాళ...జపారాగము చుట్టఱికమునంది పేశల రుచితో అనగా చల్లగా కాసినట్లు వర్ణించినాడు. ఎఱ్ఱని పుష్పపల్లవ సామగ్రి నొక్కచో దీర్ఘసంస్కృత సమాసమున గూర్చి చెప్పుట ఈ పద్యమునకు కిరీటము పెట్టి నట్లున్నది. ఇదియు నొకరచనా శిల్పము. సీసపాదములందు భ్రాంతి మదలంకారముతో భావపై చిత్రిని కల్పించినాడు. సాయంసంధ్యారుణిమలు ప్రకృతి యంతట వ్యాపించి అన్నివస్తువులకు ఎఱుపురంగు వేసినవి. అందువలన అప్పుడే గుహనుండి నిద్రలేచి బయటికి వచ్చిన పులులు సెలయేటి నీటిని రక్తభ్రాంతితో త్రాగుచున్నవి. పొదల నడుమ గడ్డిమేయు మృగములు ఎఱ్ఱని పొదలను కార్చిచ్చని భ్రమించి భయపడు చున్నవి. ఆశ్రమ వృక్షముల కాషాయవస్త్రము లారగట్టి యున్నట్లు మునులు భ్రమజెందుచుండిరి. ఈ సాయం వర్ణనము మనోహరము. అట్టి సాయంసమయమునందు.

## 34

శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెన్ బక్షు, లుష్ణాంశు పా
షాణవ్రాతము కోష్ణమయ్యె, మృగతృష్ణావార్థు లింకెన్
శోణంబయ్యెఁ బతంగబింబము, దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె, సరోజ షండములు నిద్రాణంబు లయ్యెన్ గడున్.

ఇందు అస్తమయసమయము వర్ణింపబడినది. కాని, కవి యెచ్చటను ఆ విషయమును వాచ్యము చేయలేదు. అప్పటి వివిధ వస్తు పరిస్థితిని ఒక్కొక్క విడివిడి వాక్యమున జెప్పుచు ప్రకృతి స్వరూపమును కన్నుల గట్టించి, వర్ణ్యమును మనబుద్ధికి శబ్దార్థములచేత స్ఫురింప చేసినాడు. గుంపులు గుంపులుగా బారులుదీరి పక్షు లెగురుచు పరుగులు వాఱినవి. సూర్యకాంత శిలలు గోరువెచ్చబడినవి. ఎండమావు లింకిపోయినవి. సూర్యబింబము జపాకుసుమమువలె ఎఱ్ఱవాఱినది. దిక్కులు కాంతి హీనములైనవి. పద్మసమూహములు ముడుచుకొని (కన్నులు మోడ్చి) నిద్రావస్థ నూనినవి. ఇందు ప్రాసస్థానమున 'ణ' వర్ణము నుంచి పాదము లందు ఉష్ణాంశు, కోష్ణము, మృగతృష్ణ, వంటి 'ష'కార'ణ' కార

సంయుక్త రూప (ష్ణ) విశిష్టముతోడి పదప్రయోగముచేతను, 'దరిద్రాణ నిద్రాణ' పదప్రయోగము చేతను, 'కవి ఈపద్యమునకు ఎనలేని సౌందర్య, మాధుర్యముల నాపాదించినాడు. ఈ పద్యము నం దనేక వాక్యము లున్నను ఒకే వాక్యమువలె భాసిల్లుచున్నవి. పెద్దన చతుర రచనా వైభవమున కిదియు నొకమచ్చుతునుక.

## 35

రవిబింబ పతనదీర్ణ పయోధిగర్భని
ర్గత శేషఫణి ఫణారత్న రుచియొ
దివసావసాన సందీప్తా స్తగిరిశిఖా
జ్యోతిర్లతా ప్రతానాతపంబొ
తపనధూర్దండ నిర్దళిత దిక్తటదృశ్య
కమలజాండ కటాహ కనకఘృణియొ
చండీశతాండవోత్సవ సంభృతతుపా
హస్తాగ్రదీపగభ స్తిచయమొ
ప్రాగ్విదాహచ్ఛిదావినిద్రాణ మదవ
దంజనాలాన మూలశయ్యావిధాన
వారుణాధోరణా కల్పితోరుశోణ
మృత్తికారాశియో యన మెఱసె సంధ్య.

ఈ పద్యమున పెద్దన సంధ్యారాగమును అనేక హృద్యమైన ఉత్ప్రేక్ష లతో వర్ణించినాడు. సంధ్యారాగము పడమటి దిక్కునందు శేషుని పడగల మీది రత్నముల కాంతు లనునట్లు, మెఱుపుతీగెల కాంతులనునట్లు, ప్రబద్ధలయిన బంగారు గంగాళపు కాంతులనునట్లు, రాత్రియను కాంతచేత దాల్చిన దివిటీ వెలుగులనునట్లు, మఱియు పడమటి దిక్కునందలి అంజనమను మదపుటేనుగు కట్టుకొయ్య ప్రక్కన దాని మావటీడు పడకగా ఏర్పఱచుకొనిన ఎఱ్ఱమట్టిరాశి యనునట్లును సంజకెంజాయ ప్రకాశించు చుండెనని ఇంచలి భావము. ఈ

భావము లత్యంత గంభీరములు. గంభీరభావములకు దగినట్లు భాషాశైలులు మిక్కిలి ప్రౌఢములు. సంస్కృత దీర్ఘసమాసములతో గౌడీరీతితో నారికేళ పాకముతో అర్థకాఠిన్యముతో నీ పద్యము కూర్చబడినది. సీసపాదములు సమతా గుణ విలసితములు. రెండుమూడు పాదములలోని అంజనాలాన మూలళయ్యే... త్యాదిగా గలదీర్ఘ సమాసము గురులఘ్వక్షరముల ప్రత్యేకమైన శిల్పపుకూర్పు వలన ఉయ్యాల జంపాల లూగాడుచు హాయిగొలుపు చున్నది. పెద్దన ఒక్కొక్క పద్యమును తనరచనా చాతుర్యపు ఒక్కొక్క మెల్పును దెల్పునట్లు రచించి నాడు. 'ఉరుదరీ కుహర, శ్రేణుల్‌గట్టి,మ రియు, రవిబింబపతన' మనుమూడు పద్యములును వరుసగా సంధ్యా వర్ణనము నుద్దేశించి రచింపబడినవే. అయినను ఈ మూడును మూడుపద్ధతులలో గూర్పబడి ముప్విధముల చమత్కారమును గలిగించుచు భళీ! పెద్దనా భళీ!' యనిపించునట్లున్నవి. ఈ సీసపద్యము పెద్దన సంస్కృత పాండిత్య మున కెత్తిన పతాకము! చీకటినిగూడ ఈ కవి నల్లని వస్తుసముదాయముతో గీతముస ఒక దీర్ఘ సమాసముతో చిత్రముగా వర్ణించినాడు.

## 36

ప్రిదిలి కైరవదళ శ్రేణి నొక్కులుదీరె,
శశికాంతపంక్తుల జలములూరెఁ
గౌరి కాంతులతోఁ జకోరికల్ రతిఁగేరె
వారాశిగర్వంబు మేరమీఱెఁ
ద్రోవఁ యిరులు పటాపంచలై పాఱె
దిఙ్ముఖంబుల వింత తెలివిసేరెఁ
చక్రవాకంబు లబ్జకుడుంగములు దూఱెఁ
గామినీకాంతులకలఁక దేఱె
మదనుఁ డమ్ముల నూఱె, హిమముఁబు పేరె
జడిసి విరహిణి వగఁ గూరె, జారచోర
దర్పములు జాఱె, రవికరతాప మాఱెఁ
జూడఁజూడంగఁ దారకస్ఫురణ దాఱె,

చంద్రోదయ, చంద్రి కోదయానంతరము ప్రకృతియందును లోకము నందును ఒకేకాలమున ఒకటొకటిగా జరిగిన పరిణామ పరంపర ఈ పద్యపాదము లందు, సరళశైలిలో సులభార్థబోధక మృదు మధుర పదవిన్యాసముతో, ప్రత్యేక వాక్యములతో, హృద్యములగు పదాంత పాదాంతానుప్రాసములతో వర్ణింప బడినవి. ఈ పద్యరచనమున పెద్దన ఇతఃపూర్వముకంటెనూత్నమయిన పనితనమును ప్రదర్శించినాడు. ఇంద్రజాలికుని మంత్రదండము ఒక్కొక్క ఊపున ఒక్కొక్క క్రొత్త పదార్థమును బయల్పఱచి వింతగొలుపును. ఆంధ్ర కవితాపితామహుని అపూర్వ చతురరచనా శిల్పకల్పనము అతని గంటపు ఒక్కొక్క కదలికనుండి నూత్న నూత్న పదార్థ విన్యాసపు విన్నాణములను వెలార్చును:

## 37

**స్ఫుటసౌగంధిక రాగరక్తరుచిమై( బూనెన్ జపాసన్నిధి**
**స్ఫటికంబట్లుదయాద్రి గైరికశిరస్థానస్థితిన్ జంద్రుఁ, డ**
**చ్చోటు వాయన్ శుచియయ్యె; నౌఁ బ్రకృతినచ్ఛుండైన సన్మార్గి యె**
**న్నఁటికిం గూటమివంక వచ్చు వికృతిన్ మగ్నుండుగా నేర్చునే !**

ఉదయించు సమయంబున చంద్రుడెఱ్ఱగా నుండును. అటుపిమ్మట స్వభావ సిద్ధమయిన ధవళకాంతులతో ప్రకాశించును. ఈ ప్రకృతిసత్యము ననుసరించి ఈ పద్యము రచింపబడినది. చంద్రుడు ఉదయాద్రిశిఖరమునుండి ఉదయించును. ఆ గిరి శిఖరములు ఎఱ్ఱని గైరిక ధాతువులు కలిగియుండును. కావున ఆ శిఖర ప్రదేశమునందున్న కొలదికాలముమాత్రము జపాకుసుమ సమీపస్థ స్ఫటికము వలె చంద్రునిదేహము చెంగల్వ రంగు వంటి ఎఱుపువన్నె కలదయ్యెను. [ఇది సాంగత్యదోషమువలన కలిగిన మార్పు] ఆ ప్రదేశమునుండి కదలిపోగా తిరిగి అతడు పరిశుద్ధుడై పూర్వపు ధవళిమను పొందెను. ఇది యిట్లే కదా! స్వభావము చేత నిర్మలుడయిన సన్మార్గుడు. సహవాసమువలన కలిగిన వికారమునం దెప్పటి కిని మునిగియుండునా ? అనగా అట్టి వికారమునం దెన్నటికిని మునిగిపోజాలడని భావము. చంద్రుడు గిరిశిఖరవాసముచేత క్షణకాలము ఎఱ్ఱబాఱినాడు, ఆ స్థాన

మును విడిచిపోగానే ఎప్పటివలె మఱల తెల్లబడినాడు. ఈ విషయమును స్వభావముచేత స్వచ్ఛుడైన సన్మార్గి సహవాసముచేత ఒక వికారమును పొందినను, ఆవికారావస్థయం దెల్లకాలము నట్లే యుండక, వికారకారణము తొలగినంతనే తిరిగి యతడు శుద్ధుడగునని కవి అర్థాంతరన్యాసముచేత సమర్థించినాడు. చంద్రోదయమును వర్ణించిన విధమును బట్టియు, ఇందలి అర్థాంతరన్యాసమును బట్టియు కవి యిందు ప్రవరుని వృత్తాంతము ననుసంధించిన ట్లూహింపవలెను.

ప్రవరుడు స్వభావముచేత స్వచ్ఛుడు, సన్మార్గుడు. [సన్మార్గి యనగా చంద్రుడనియు అర్థము]. ఉదయాద్రి శిఖరమునందు చంద్రుడు, జపాకుసుమము చెంతనున్న స్ఫటికమువలె ఎఱ్ఱబడినాడు. ప్రవరుడుకూడ హిమాద్రిపై వరూథిని కౌగిలిలో చిక్కిన క్షణకాలము మలినుడైనాడు. స్వభావముచేత నిర్మలుడు కాబట్టి అతడెప్పటికి మలినుడుగా నుండలేదు, బలముగా ఆమెను త్రోసి కౌగిలినుండి, సహవాసులనుండి తప్పుకొన్నాడు. వెంటనే "అవ్వనజగంధి మేని జవ్వాదిపసకదంబించు నొడలు గడిగికొని వార్చి" గార్హపత్యవహ్నిని స్తుతించి ప్రవరుడు పూర్వమువలె పరిశుద్ధుడయినాడు. "పావకప్రసాదలబ్ధంబను పవనజపనంబున నిజమందిరమున కరిగి నిత్యకృత్య సత్కర్మకలాపంబులు" నిర్వర్తించుటే, కూటమి [సహవాసము]వంక వచ్చు వికృతక ప్రకృతి నచ్ఛుండైన సన్మార్గి యెన్నటికి మగ్నుండు' కాజాలడనుటకు నిదర్శనము. ఈ చంద్రోదయము వర్ణనమును అందలి అర్థాంతరన్యాసమును గృహస్థుడు ప్రవరునివలె స్వచ్ఛ స్వభావుడును సన్మార్గుడైయుండి వికారమునకు లోనై యుండరాదను నట్టి గార్హస్థ్య ధర్మోపదేశము మనుచరిత్ర రచనోద్దేశములలో నొకటియను వాదమునకు బలము చేకూర్చుచున్నవి. చంద్రోదయమునుగూర్చి యిట్టి అపూర్వమగు ఊహ పెద్దనకు స్ఫురించుటకు దీనికించుక పూర్వ మతడు వర్ణించిన ప్రవర వరూధినుల కథలోని చివరిఘట్టమే ప్రేరకమైయుండునను ఊహ అసమంజసము కాదు.

## 38

కలయ జగమునఁ గలయట్టి నలుపులెల్లఁ
దెలుపులుగఁ జేసి నీడలు తెలుపు సేయఁ

గావళముగామిఁ బొడము దుఃఖమునఁ బోలె
సాంద్ర చంద్రిక తుహిన బాష్పములు గురిసె.

వెన్నెల జగమున గల నలుపులన్నిటిని తెలుపులుగ చేసినది. నీడలను మాత్రము తెలుపు చేయ జాలని దుఃఖము చేతనో అనునట్లు దట్టమైన వెన్నెల మంచు కన్నీరు కురిసినదట! ఈ గీతముయొక్క సరళశైలియు 'సాంద్ర చంద్రికతుహిన బాష్పములు గురిసె' నను భావభాషాదులను ఆధునికములైన భావకవుల రచనలను జ్ఞప్తికి దెచ్చును.

## 39

చనుఁగప్పు దొలఁగ వాసనగాలి కెదురేగుఁ
బరువొప్పు నలుఁగులఁ బాలుకరణి
నిడుద వేనలినూనె ముడి వీడఁ చిగురాకుఁ
బొదఁ దూఱుఁ గార్చిచ్చుఁ గదియుకరణిఁ
బసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి నుఱుఁదీఁగఁ
దెమలించు నురిత్రాడు నెమకు కరణి
మొలనూలు బిగియించి వెలఁది వెన్నెలఁ జొచ్చుఁ
బిలుదీయ కేటిలో నురుకుకరణి
జడియ దళులకుఁ గురియు పుప్పొడుల మునుఁగు,
మావికడ నిల్చు, విరుల నెత్తావిఁ గ్రోలు
విషమసాయకు నేఁపుల విసివి విసివిఁ
తనువుఁదొఱఁగంగఁ దలచి యవ్వనరుహాక్షి.

ఇందు మదన తాపార్తయయిన వరూధిని దశావస్థలలో చివరిదగు మృతి యను అవస్థకు చేరినది. తన ఉద్యానవనమునందు వెన్నెలరాత్రియందు మరణ ప్రయత్నము చేయటను కవి ఈ పద్యమున హృద్యముగా వర్ణించినాడు. ఇందలి రచనా శిల్పము ప్రత్యేక మయినది. వరూధినిని మరణోద్యోగము నుండి విర

మింపజేసి కన్నీరు తుడుచుచు హితాహితములను బోధించునట్లు చెలులు పలుకుట, ఈ క్రింది పద్యమున అవ్యక్తమధురోక్తులతో కూర్పబడినది. ఇదియొక ప్రత్యేక మైన రచన.

## 40

**పూఁతపసిండి వంటి వలపున్ బచరించు కులంబు నీతికిన్**
**లేఁతగదమ్మ, యిత్తెఱఁగు, లేమ సురాంగనలెల్ల నిట్టినీ**
**చేఁతకు మెత్తురమ్మ, దయసేయక తిన్నని మేను వెన్నెలన్**
**వేఁతురటమ్మ, యింతకను వేదురు సెల్లునఁటమ్మ యింతికిన్.**

వేశ్యల కులధర్మములి ందు తెలుపబడుటే కాక ఇవి చెలుల మందలింపుల వలె కూడ నున్నవి.

## 41

**సకలాశాగతి, నర్మకోపవిరతి, క్రౌంచక్రియా రంభణా**
**త్మక వర్గత్రయికిన్, మదుచ్చరిత శబ్దజ్ఞాన మేమూల, మిం**
**తకు బోలన్ వినుడంచుఁ దెల్పుగతిఁ జెంతన్ గొండపైపల్లెలన్**
**గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్.**

ఇందు కోడికూతను పెద్దన అలంకార రీతిలో చిత్రముగా వర్ణించినాడు. అతి ప్రసిద్ధము లయిన మనుచరిత్ర పద్యములలో ఇదియొకటి. దీనిని ఒరవడిగా గ్రహించి తర్వాతి కవులు ప్రబంధములలో 'కోడికూతను' వర్ణించుట పరిపాటి యైనది. పెద్దనకు పూర్వమిట్టి వర్ణనలు కొలదిగా నుండినను వానికీ ప్రసిద్ధి రాలేదు.

చంద్రుడ స్తమించినాడు. వేగుచుక్క పొడిచినది. అపుడు కొండమీది పల్లెలలోని ఇండ్లమీది కోళ్ళు మెడవంచి 'కొక్కొ-రొకో' యని ముత్తెఱగుల కూసినవి. కోడి కూత విని తెల్లవాఱినదని తెలిసిమేల్కొని ప్రజలు తమ తమపనులు ప్రారంభింతురు. జనులు పనులు చేసికొనుటకు అన్నిదిక్కులకు పోవుదురు.

దీనినే "సకలాశాగతి" అని కవి చెప్పెను. స్త్రీ పురుషులు తమ ప్రణయ కోపమును మానుదురు. ఇదే "నర్మకోపవిరతి" వైదికులు స్నానసంధ్యాదికమున కుపక్రమించుట శ్రౌతక్రియారంభణము, ఈ మూడును క్రమముగా అర్థ, కామ, ధర్మములను త్రివిధ పురుషార్థములు. ఈ మూడింటికిని తన కూతయే మూలకారణమని చాటించుచున్నట్లు ఉన్నతస్థానమున నిలిచి 'కాక్కాకోకో' అని కోళ్ళు "త్రిభంగి"గా కూసినవట ! ఈ పద్య భావము.

**జక్కవలకు రవి యిక ప్రాగ్దికురం బెక్కు నసుచుఁదెలియ త్రివాచన్**
**నిక్కముచేసిన తెఱఁగున కొక్కొరొకో యనుచు కోడికూయ దొడంగెన్.**

అను వరాహపురాణములోని (4-164) పద్యమునకురమణీ యార్థముతో కూడిన పెంపుదల. "కూసె విలాసచ్చరమాచలకూటపక్కణగ్రామటికా కుటీర శిఖరంబుల గుక్కుట చక్రవాకముల్" (8-153] శృంగార నైషధము. పైరెండు పద్యముల భావములను మేళవించి వానికంటె రమ్యముగ విశేషార్థవంతముగను కవి నవ్యఫణితిని "కోడికూతను" వర్ణించుచు "కాక్కారోకో" అను ధ్వనియందలి త్రిభంగిని వర్గత్రయముగా చమత్కారముగా వివరించినాడు.

ఈ క్రింది పద్యమున నాట, దేశాక్షి రాగములను పేర్కొని తన సంగీత శాస్త్ర పరిచయమును సూచించుటే కాక మృదుమధుర పదసమాసములతో, నీ పద్యమును పెద్దన రచించినాడు.

## 42

**వాలారుం గొనగోళ్ళ నీ వలసతన్ వాయించుచో నాటకున్**
**మేళంబైన విపంచి నిన్న మొదలుం నీ వంటమింజేసి యా**
**యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా**
**లోల తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షి దేశాక్షికిన్.**

వరూథిని తన వీణను నిన్నటి మధ్యాహ్నమున నాటరాగమునకు మేళవించి వాయించు చుండెను. ప్రవరుని చూడగనే వీణను వదలి వేసినది. అప్పటి నుండి దానినిముట్టలేదు. తెల్లవాఱుగా వచ్చిన మెల్లని గాలితాకిడికి కదలి తంత్రులు

నాటరాగములే పలుకు చుండినవి. నాటరాగము పగలు పాడదగినది కాబట్టి, తంత్రులను ప్రొద్దున పాడ దగిన దేశాక్షి రాగమునకు మేళవింపు మని చెలులు చెప్పిరి.

ఈ క్రింది సీసమున ప్రవర విరహముచే సమస్త భోగవవస్తువు లందు, 'అరతి' అనగా అయిష్టత కలిగినది. ఈ విషయమును ఉద్యానగమనమునకు చెలుల బలవంతము చేత సిద్ధపడుచున్న ఆమె ప్రవర్తనల చేత బహురమ్యముగా ధ్వనితము కావించినాడు.

## 43

మనసారపంక మొక్కలతాంగి దెచ్చిన,
    ముట్టి వ్రేలనె చుక్కబొట్టు పెట్టి
యింతి యొక్కతె పూవుటెత్తులెత్తిన,జూచి,
    విసువుతో నొకకొన్ని విరులు దుఱిమి
పడతి యొక్కతె తన్నపాదుక లిడ నిల్చి,
    తొడుగ కవ్వలికిఁ బోనడుగు పెట్టి
బాగాలు వెసనొక్క పద్మాక్షి యొసగిన,
    వెగ్గలం బని కొన్ని వెడల నుమిసి
సగము గొఱికినయాకును, సఖులు పిలువ
సగ మొసఁగును త్తరముఁ, దెల్విసగము, మఱపు
సగము, నయి, చింతచే సగమగుచు నరిగె.
నవ్వరూధిని యంతికోద్యానమునకు,

పద్యము సరళముగను సరసముగను రచింపబడినది. ఇందలి 'బాగాలు' అను పదము తెలంగాణమున మిక్కిలి ప్రచారము నందున్నది. పెద్దన, రామకృష్ణుడు, పింగళ సూరనవంటి కవి దిగ్గజములు ప్రయోగించిన ఈ పదము ఆంధ్ర ప్రాంతమున ఎక్కువ వాడుకలోనున్నట్లు కనబడదు. 'సగము' అను పదమును బహువిధముల ప్రయోగించి కవి ఇందు రచనానచమత్కృతిని ప్రదర్శించి నాడు.

## 44

వెలది యిచ్చటి సంపెంగవిరులు, గమన
దేవతల యిండ్ల నెత్తిన దీపశిఖలు
గాక యుండినఁ బంచబంగాళ మగుచుఁ
బాఱునే మత్తమధుకర పటలతమము.

ఈ పద్యశైలి అధునిక కవులశైలిని బురుడించు చున్నది. సంపెగ విరులను దీపములను జూచి చీకట్లవంటి నల్లని తుమ్మెదగుంపులు పాఱిపోవు చున్నవను భావము మనోహరము.

## 45

వాడిన మోముఁదమ్మి తెలివాలికకన్నులు విన్నఁబోవఁదో
నాడక, నెన్నొసల్ కరమునం దిడి తీరనిషణ్ణయై, జలం
బాఁడగఁ బిల్చువారి నొకహస్తపు మ్రొక్కున నాడుఁ
డంచు, దా
జూడక చూచుచూడ్కి నలుఁగోటి దెసల్ పరికింప నొక్కచోన్.

ప్రవరుడు తిరిగి కనుపించునేమో అను ఆసతో వరూధిని ఉద్యానమునకు చెలులతోగూడ వచ్చినది. ఆమె చెలులు జలకము లాడుచున్నారు. వాడిన మోముతో, చిన్నబోయిన కన్నులతో వరూధిని నొసటిని చేతియందుంచి, కొలని గట్టున గూర్చొని దిక్కులు చూచుచున్నది. చెలు లామెను స్నానమాడ రమ్మను చున్నారు. మాటలాడు ఓపికలేక 'ఒక్కచేతితో మ్రొక్కుచు' మీరాడుడు'నన్ను విడిచిపెట్టుడు, మీదయ' అన్నట్లు బ్రతిమాలిన దని భావము. మనది రెండు చేతుల నమస్కారము ఒకచేతిమ్రొక్కు 'అనగా సలాము'. ఇది మహమ్మదీయ సంప్రదాయము. 'గోవధము సేయు తురకల దైవంబువు' అని వరూధిని చంద్రుని దూషించినది. ఇట్లు కవి తనకాలమున మనదేశముపై మనసంఘముపై మహమ్మదీయుల యొక్కయు వారి సంస్కృతి యొక్కయు ప్రభావమును కవితా రూపమున సూచించుట గమనింప దగియున్నది. కొలనులో చెలులు జకాల

లాడుట, గట్టుమీద ముఖపద్మ మొకచేత నానించి కూర్చుండి రెండవ చేతితో చెలులకు మ్రొక్కుచున్నదను పెద్దనగారి ఈ వాక్చిత్రమును చిత్రకారుడు బొమ్మగీయవచ్చును. పెద్దన కావ్యమునం దిట్టి 'మధురమంజుల' శబ్దచిత్రము లనేకములు,

## 46

**ఏలర ! యీచలం బుడిగి యేలర, బాలరసాల మాలతీ**
**జాలములో, శశాంక కరజాలములో వలవంత నశ్రువుల్**
**జాలుగ, నాల్గు జాలు నిటఁ జాలు భవంబను వంత కాఁకకున్**
**జాలయి రాత్రి పంచశరు జారికిఁ జిక్కితి నీకు దక్కితిన్.**

మాయాప్రవరుని నిజప్రవరునిగా మనఃపూర్తిగా భావించిన వరూధిని దీనముగా గతరాత్రి రేయెండలో తా ననుభవించిన భరింపరాని వలవంతను, దీనాతిదీనముగా ఏకరువు పెట్టి ఏకరణినైన తన్నేలి ప్రాణముల నిలువరింపుమని ప్రార్థించుచున్నది. ఈ భావమును పెద్దన శిరీషకుసుమ సుధామయోక్తులతో గంధర్వుని మనస్సునట్లుంచి, నిజప్రవరుని మనస్సును, మన మనస్సులుగూడ (వెన్నెలలో వలవంతచే వరూధిని కరిగినట్లు) కరగునట్లు కూర్చినాడు. అలతి యలతి వాక్యములతో ముక్తాయింపులతో కూడిన ఈ శైలి అత్యంత ఆధునికము కాదనగలమా ? 'ల, ర' వర్ణములను మరల మరల కూర్చుట పద్యమునకు సంగీత సౌందర్యమును సంతరించుటలేదా ? సహస్రాంశునివలె సహస్ర ముఖములతో సాగిన పెద్దన చతుర రచనా శిల్పకళాంశ యొకటి ఈ పద్యమున దర్శనమిచ్చుచున్నది.

## 47

**నునుఁ జిగురాకు మేయు తఱి నోరి కెలంకులఁ దేటి గుట్టినన్**
**వనతరుశాఖలం గువకువధ్వనిఁ బాఱు పికాంగనన్ బికం**
**బనునయ మొప్ప మాన్పుగతి నాత్తముఖంబు ముఖంబుఁ జేర్చి చుం**
**బన మొనరించె, సందుసుడిమాయలుగా మగవారి కృత్యముల్.**

ఈ పద్యము వన విహారము చేయుచున్న వరూధిని చెలులలో నొకతె వేఱొక చెలితో అచటి చెట్టు కొమ్మఁమీద కోకిల జంటను జూపి చెప్పిన

ప్రౌఢోక్తి. ఆడ కోకిల చిగురాకులు తినుచుండగా దాని సెలవులకు తుమ్మెద కుట్టినది. ఆ బాధకు అది యిటునటు పొఱలుచుండెను. అచటనున్న మగ కోకిల దాని బాధ తీర్చునట్లు మొగమున మొగముంచి ముద్దిడుకొన్నది. ఇట్లు పలికి ఆ చెలి, మగవారి చేష్టలు సమయము చూచి మోసపుచ్చునవిగదా! అను అర్థాంతరన్యాసముతో తన మాటను సమర్థించుకొనినది. ఇందు వరూధినీ మాయా ప్రవరుల వృత్తాంతమును పెద్దన సూచించినాడు. విరహతాపార్తయైన వరూధినిని సమయముచూచి గంధర్వుడు వంచించినాడు.

ఇంటికైన యజమాని లేనిచో ఉన్నసంసారముకూడా ఎట్లు దిక్కుమాలినదగునో సహజముగా వర్ణించి కవి ఈ క్రింది పద్యములో తన లౌకిక జ్ఞానమును ప్రదర్శించినాడు.

## 48

పై పరామరిక చొప్పడమిఁ బక్వము దప్పి
పండఁబాఱిన పొల మెండఁబాఱె
గట్టఁగాపింపఁ దఱుత లేమి నూరూర
బందెలఁ బడిపోయెఁ బసులగణంబు
వంచనామతిఁ బ్రాడ్వివాకులై వటువు
లొజ్జల కొప్పగించిరి చదువులెల్లఁ
గికురించి రిచ్చిపుచ్చుకొను చోటులవార
లాఁకకు లోనుగా కప్పు లీక
గ్రహణ సంక్రమణాదుల రాచనగరఁ
గాసు వీసంబు వెడలమి గ్రాసమునకు
నాధిపెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని
లెస్సయుండునె గృహకర్త లేని బ్రదుకు.

ఇది మాయాప్రవరుడు వరూధినికి నమ్మబలికి అటనుండి వెడలిపోవ సంకల్పించి చెప్పిన సాకుమాటలు. ఇందలి యర్థభావములు సుగమములు. పెద్దన శైలిలో భాషలో మార్పు ఇందు ముఖ్యముగా గమనింపదగినది. పెద్దన

కూడ అగ్రహారీకుడై రాజాస్థాన నివాసము కలవాడు కావున ఇందు స్వానుభవ మునుకూడ కొంత జతచేసి వర్ణించియుండును.

ఈ క్రింది పద్యమున కవి ఐహిక విషయ భోగము లెంత యనుభవించి నను అవి ఉపశమనము పొందకుండునని సోపమానముగా నిరూపించి యున్నాడు.

## 49

**వడిఁ గాఁచికాఁచి యుండఁన్**
**కడవలనీ రినుము ద్రావు కైవడిఁ, బై పై**
**బొడమెడు కోర్కులచేఁ బె**
**ల్లుడికినమది భోగముక్తి కూఁటఁ గనునే.**

ఇనుము నెంత యెక్కువగా గాఁచిన నది యన్ని కడవల నీరు పీల్చుచు చల్లారదు. అట్లే అనుభవించిన కొలదిని ఇంకను నమభవింపవలెనను కోర్కెలు హెచ్చునేకాని భోగవాంఛ తగ్గనిది. ఇందు విషయ భోగముల తత్త్వము విదితము చేయబడినది, ముందుగతిని గమనించక నియమరహితముగ ఇష్టము వచ్చినట్లు సుఖములకొఱకు ప్రాకులాడువాని కిహపరములందు కలుగు నష్ట పరంపరలు ఈ క్రింది పద్యమున కవి వివరించినాడు.

## 50

**ఎవ్వఁడు మీఁ దెఱుంగక యథేచ్ఛ సుఖైక రతిన్ జరింపఁగా**
**నవ్వల వంశహాని, వ్రతహాని, యశోధనహాని పుట్టుఁ దా**
**నవ్విధఁ గమ్మనుష్యపశు వయ్యవివేకి చెడుఁ జగంబునన్**
**నవ్వఁగ వాలు రౌరవమునం బడ వాలును నిందపాలునై,**

ముందుచూపు, పరలోక భీతి లేక సదసద్విచార వివేకహీనుడై, ఇష్టాను సార సుఖానుభవమునకై పెనగులాడువాడు వెఱ్ఱివాడు. మనుష్యపశువు, అవివేకి. అట్టివాడు వంశహాని కలిగి ఇహమున నవ్వుల పాలగును. వ్రతాచార హాని కలిగి మరణానంతరము రౌరవాది నరకముల పాలగును. కీర్తిహాని కలిగి నిందల

పొలగును. ఇహపర భీతి గలిగి హితముగా మితముగా సుఖభోగము లనుభ వింపవలెననియు, అట్లు కానినాడు వాడు 'రెంటికిం జెడిన రేవడు' కాగలడని కవి హితబోధ.

## 51

కరకా చిటపటరవ భీ
కరమై పెళపెళ నినాద ఘనమై ఝుంఝూ
మరుదుజ్ఝిత బిలమంద్ర
స్వరమైయకొ్కండ నొక్క వర్షము గురిసెన్.

వడగండ్లు, ఉరుములు, హోరుగాలితో గూడి కొండమీద గురిసిన వర్ష మును ఇందు వర్ణింపబడినది. 'పటపట' 'ఫెళఫెళ' 'ఝుంఝూ' అను ధ్వన్యను కరణ శబ్దములచే కవి పై మూడింటిని క్రమముగా ప్రతిధ్వనింప జేసినాడు. ఇదియు నొక రచనా చమత్కారమే.

## 52

గూనివీఁపు లదుర గొణఁగి తిట్టుచు నేతుఁ
గఱచినట్టి కుక్కగండ్లనంగ
మూతి నరప మీసముల బోయముదుసళ్ళు
పంది వలలు మోచి పఱచి రపుడు.

ఈ పద్యము స్వారోచివేట వర్ణనములోనిది. బాగుగా నరసిన తెల్లని దూదివంటి కోరమీసములుగల ముదుసలి బోయలు, నోట ఏకు గఱచి పట్టిన గండు కుక్కలవలె నుండిరట! గూనివీపు లదరగా వంగి పరుగెత్తుచుండుటచే వారట్లే కనిపించుచుండిరి.

## 53

విసుమానములు గాఁగ వసతోడఁ బెనవెట్టి
నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాఁడు

బండి కందెన చాయ బైసిమాలిన మేన
మెదడు గంధపు రొంపి మెత్తినాఁడు
కునఖంపుడాచేతి పునుక కప్పెర నిండఁ
బ్రాణికోటుల నల్లఁ బట్టినాఁడు
కోకిబికి వేసంపు గూని మూఁపులమీఁద
మూడు పంగల యీటె మోపినాఁడు
నిట్టతాడనఁ బొడవుచే నిక్కినాఁడు
నిడుద కోరల, మిడిగ్రుడ్ల నెగడినాఁడు
నరవరోత్తమ నేఁడు మూన్నాళ్ళనుండి
యుసురుగొన వెంటఁ దిరిగెడు నసురయొకఁడు.

ఇందు మనోరమ తన్ను తరుముకొనివచ్చు రక్కసుని జుగుప్సాకర భయంకరాకారమును స్వరోచికి వర్ణించి చెప్పినది. తలకు ప్రేవుల తలపాగ, ఒంటికి మెదడు గంధపు పూత, ఎడమచేత నెత్తుటితో నిండిన కపాలము, గూని మూపులమీద మూడుపంగల యీటె, నిడుద కోరలు, మిడిగ్రుడ్లు, నిట్టతాడంత యెత్తు- ఇది ఆ రక్కసుని వికృతాకారము. ఇందు కవి ఉపయోగించిన పద జాలము, శైలి ప్రత్యేకమయినవి.

## 54

ఎట్టివాడు మునికాడో, ఎవడు మునియో ఈ క్రింది రెండు పద్యములలో క్రమముగా తెలుపుచు ముని ధర్మ మెఱింగింపబడినది.

పాము కడు ముదిసి కడపట
గామగు చందమున వార్ధకంబునఁ గ్రోధం
బేమియు మానక మండెడు
నాముని మునియే, తలంప నదియున్ దపమే?
పరుల యపరాధ గతులకుఁ
గెరలక తనుఁ బొగడుచోటఁ, గీడాడెడుచోఁ

పరితోషము రోషము నెదఁ
బొరసీని తపస్వి సుమ్ము! సుకృతి ధరిత్రిన్.

## 55

కైదువు సున్న, పూజ్యములు కంకటఖేట శిరస్థలిత్రముల్,
లే దరదంబు. తత్తడి హుళిక్కి, సహాయము సర్వమంగళం
బీ వనుజుండు చిక్క భయ మేటికి, లుబ్ధకులార! యాత్మకుం
బేదతనంబు మేలె, మఱి మృత్యువు దాఁగెడిచోట లేదొకో!

రక్కసునికి భయపడి పాఱిపోవుచున్న పుళింద సైనికులను తిరిగి యుద్ధమునకు పురికొల్పుచు, స్వరోచి మృత్యుస్వరూపమును దెలిపి, వారికి ధైర్యము గొలుపుటకు ఉద్దేశింపబడినది ఈ పద్యము. ఇందు సున్న, పూజ్యములు, వేదు, హుళిక్కి, సర్వమంగళము - అను పర్యాయపదములను అభావార్థమున ప్రయోగించినాడు కవి. ఇది యొక విధమయిన రచనాచమత్కారము. మృత్యువునుండి తప్పించుకొనుట అసాధ్యమను ఈ భావమునే పెద్దన మఱియొక పద్యమున చెప్పి ఆ తర్వాతి పద్యమున కర్తవ్యము నుద్బోధించినాడు. అట్టి యీ క్రింది పద్యములు తెలుగు శైలిలో సరళముగ వ్రాయబడుట ఒక విశేషము.

## 56

నీడఁ గడవఁబాఱు, నేలకు వెలిగాఁగ
నడుగు వెట్టి తిరుగ, నాత్మ మొఱఁగి
యొకటిఁ దలఁప నరుల కొదవిన;నొదవ దే
కరణి మృత్యుదేవిఁ గన్నుఁ బ్రామ.

ఒకవేళ తననీడను తప్పించుకొని తిరుగుటవంటి అసాధ్యములను సాధింపగలిగినను, నరుడు మృత్యుదేవి కన్నులు గప్పలేడని భావము.

చావుఁ దలపోసి మానవుఁ
డేవగ దుష్కీర్తి వొరయకే దినములు పొం

దై వెడలునట్లు నడవఁగ,
దైవం బటమీఁద మేలు తాన ఘటించున్.

శృంగార ప్రధానములును, పాండిత్య ప్రకర్షకములుగా భావింపబడు ప్రబంధములందు, అందును మనుచరిత్రమున సుమతిశతకము, భారతము, భర్తృహరి సుభాషితములు మున్నగువానిలోవలె నీతిపద్యములుకూడ కలవని యెల్లరకు దెలియదు. దీని తర్వాతి సీసమున పెద్దన ధైర్యమహిమను ఉగ్గడించి నాడు.

ఇందీవరాక్షుడను గంధర్వుడు మునిశాపముచే, రాక్షస భావమును పొందునప్పటి అనుభవమును పెద్దన క్రింది పద్యమున అద్భుతముగా మనోహర శైలిలో వర్ణించినాడు. భావానుకూలమైన రచనావిధాన మిందు చూడనగును.

## 57

అభ్రమండలి మోచునందాక నూరక
పెరిఁగినట్లా మేను నరవరేణ్య
యవధిభూధర సానువందాఁక నూరక
పలచినట్లా మేను పార్థివేంద్ర
యబ్జభూభువనంబునందాఁక నూరక
యెగసినట్లా మేను జగదధీశ
యహిలోకతల మంటునందాఁక నూరక
పడినయట్లా మేను ప్రభువతంస
యఖిల జగములు మ్రింగునంతాఁకలియును
నబ్ధు లేడును జెడఁ గ్రోలునంత తృషము
నచలచాలనచణమైన యదటుఁ గలిగె
నసుర భావంబు నను జెందు నవసరమున.

ఇందలి 'ఊరక పెరిగినట్లా' అనునిత్యాదిగానున్న వాక్యములలోని 'ఊరక'లోని 'ఊ'కారముయొక్క ప్లుతోచ్చారణము, అ రక్కసుడు పెరిగిన

ఎత్తు మున్నగు వానిని సూచించుచున్నది. ఇది ఈ పద్యమునకు జీవము ఇందలి రచనా శిల్పము.

## 58

మెలఁతకు బతిపై నైనను,
మెలఁతుకపైఁ బతికినైన మేలగు బెందున్
గలయది; మెలఁతకుఁ బతికిన్
వలపు సమంబగుట జన్మవాసన చెలియా!

స్వరోచి తన ముగ్గురు భార్యలతో నేకకాలమున భోగములనుభవించు చుండ చూచి, ఒక హంసాంగన చక్రవాకితో పలికిన పలుకులే ఈ పైపద్యాలు. వారు అన్యోన్య ప్రేమతో నున్నట్లు భావించినది హంసి. లోకములో పతికి సతి మీదకాని, సతికి పతిమీదగాని ప్రేమయుండుట సహజమే. కాని ఇరువురును సమానానురాగము గలిగి, వీరివలె అన్యోన్యముగా నుండుట పూర్వజన్మ వాసన సుమా! అని చక్రవాకితో నన్నది. 'వలపు సమంబగుట జన్మవాసన చెలియా' అను ఇందలి వాక్యము ఆధునిక కావ్యములోనిదని చెప్పిన నమ్మనివారుండరు.

## 59

ముదమున నిమ్మహీశుఁ డొక ముద్దియ చూడఁగ నొక్కకాంతతో
పదమదమై కడంగి రతి సల్పుట తెల్లమిగా నెఱింగియున్
మది వివరించి రోయ కభిమానము దక్కిన వీరి కూరుముల్
వదలక పెద్ద సేసెదవు వందిగతిన్, దగ వీ విచారముల్.

వెనకటి పద్యమునందలి అంచలేమ వాక్యాలను ఖండించి, చక్రవాకి దానితో, ఒకతె యెదుట నొకస్త్రీతో రమించు వీరిని జూచి యితర భార్య లేవ గించుకొనక, అభిమాన రహితలయిన వీరి ప్రేమలు ప్రేమలుకావు. వీరినిగూర్చిన నీ ఆలోచనలు సరియైనవికావని చక్రవాకి మరియు నిట్లు చెప్పినది.

## 60

**పలువురయందు నొక్కనికి బ్రాఁతియు, నొక్కనియందుఁ జూడ న
గ్గలమగు ప్రేమ పల్వురకుఁ గల్గుట యద్భుత మట్లుగాన, ని
వ్వెలఁదులయందు గూర్మి పస వీనికి నేమియులేదు, వీనియం
దలవడఁ గల్గ దీ జలరుహాక్షులకున్ బ్రియ మెవ్విధంబునన్.**

పలువురు వనితలందొక్క పురుషునకు, అట్లే ఒక పురుషునియందు పలువురు వనితలకు అధికమగు ప్రేమ యుండుననుట చిత్రము. ఇట్లుండుట ప్రేమ స్వభావమునకే విరుద్ధము. కావున నీవు భావించినట్లు ఈ వనితలయందు స్వరోచికిని, అతని మీద ఈ ఈ వెలదులకును ప్రేమలేదని అంచలేమతో బలికినది. మఱొకమాటలో జెప్పదలచిన చక్రవాకి స్వరోచి 'బహుభార్యాత్వమును' నిరసించినది. స్వరోచి వలెనే ముగ్గురుభార్యలు గల కృష్ణరాయల కిట్టి విషయముతోగూడిన మనుచరిత్రమును పెద్దన కృతియిచ్చుటయు, అ మహారా జాదరముతో కృతినందుకొనుటయు ప్రశంసార్హములు.

## 61

**ఈ నెలఁత లీ మహీశు
నహీనగతిన్ దగిలిరేని, నితఁ డొకలేమన్
దా నెలమిఁ గూడు నెడ, నే
మానిని ప్రాణేశు మీఁది మమత మెలంగున్**

ఇదికూడా చక్రవాకి వాక్యమే. ఇట్లు పలికి ఆ చక్రవాకి.

**తగులు నెవ్వఁ డొక్క తరుణికి,
నొకనికి మెలఁత వలచు నదియ మేలనంగ
వచ్చుఁగాని; పెక్కు వనితలపై
గూర్మి గలుగు ననుట బొంకుగాదె తరుణి!**

పెక్కు వనితలపై నొక్కనికిని, ఒకనిపై పెక్కు వనితలకును ప్రేమయుండుననుటకల్ల. ఒకస్త్రీపై ఒక పురుషునకును, ఒక పురుషునిపై నొక

స్త్రీకి ప్రేమయుండుననుట వాస్తవము. అని యిట్లు ప్రేమ స్వరూపమును నిరూపించి ఏకపత్నీత్వమును సమర్థించినది ఆ చక్రవాకి. ఇందలి ప్రథమ కథకు నాయకుడైన ప్రవరుడు ఏకపత్నీవ్రతుడు. అతని సతి సోమిదమ్మ అనుకూలవతి, అతని మనసులో వర్తించు కులకాంత. ధర్మ, కామ, మోక్ష, పురుషార్థ సాధనమున నామె యతని సహధర్మచారిణి. తానై తాను వలచివచ్చి మీదబడిన గంధర్వ కామినిని కాదని త్రోసిపుచ్చి యతడు సోమిదమ్మనే చేరుకొన్నాడు. ప్రవరుని ధర్మ దాంపత్యమట్లు శ్లాఘాపాత్రమయినది. ఇట్టి దాంపత్య ధర్మము నుపదేశించుటకే మనుచరిత్ర ముద్దేశింపబడినది. కేవలము కామాంధమైన వరూధినీ గంధర్వుల (మాయ ప్రవరుని) వలపును, పారర్ణిమోహమును, దేవాపి కామాంధత్వమును, స్వరోచి బహు భార్యాత్వమును మనుచరిత్రము ఆఖ్యానాత్మకముగను కంఠోక్తిగను నిరసించినది. మనూత్పత్తి రూపమగు దేవకార్య సంపాదనమున నుద్దేశింపబడిన వనదేవతా స్వరోచుల సంగమము నిది ధర్మబద్ధముగా అంగీకరించినది. ఇందలి ప్రధానాప్రధాన కథలలో ననేకములు, తృతీయ పురుషార్థమయిన కామముయొక్క సదసత్స్వరూపముల నిరూపించునట్టివే. భార్యాభర్తల మధ్యనయినను అనుచిత శృంగారము నింద్యమనుట స్వరోచి కథచేతను, ప్రథమ పురుషార్థమయిన ధర్మముతోగూడిన కామపురుషార్థమే నరుని చతుర్థమయిన మోక్షసామ్రాజ్యమునకు నర్హునిగా జేయునని ప్రవరుని కథచేతను, మనుచరిత్ర మనకు కాంతాసమ్మితముగా నుపదేశించుచున్నది.

వరూధిని ప్రవరుని అల్లుకున్నట్లె ఆడులేళ్ళు హరిణోత్తంసుని చుట్టుముట్టి మూర్కొని యట్టునాక జొచ్చినవి. వాని యింగితము నెఱిగిన అ పురుష హరిణము వానిని జూచి

## 62

హుంకారం బొనరించి వేతలఁగు డోహో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడు దర్పస్ఫూర్తిఁ గ్రీడింప, ల
జ్జాంకూరం బడగించినాగు తలపోయ న్నాకు రోఁతయ్యె, మీ
రింకన్ బోయి వరింపుఁ డొక్కరుని, భోగేచ్ఛన్ నివారించితిన్.

అని గద్దించి పలువురింతులను గూర్చుకొని, వారితో నిరంతరము క్రీడించుచు వినోదించు స్వరోచిది కేవలము 'భోగవాంఛ' యనియు, అట్టివానికి నిహపరంబులులేవనియు ప్రవచించురీతి నీ క్రింది విధమున బలికినది.

**ఐరువన కింతులం దనకుఁ బల్వురఁ గూర్చుట భోగవాంచగా**
**కరయఁగ నొండుగాదు, ధనమన్న ధ్రువంబుగ నంగనా జనో**
**త్కర సముపార్జితం, బటులు గావున వీనికి లే దిహంబునుం**
**బరమును నన్ను నట్ల బలుపం బనిలే దిది చెప్ప నేటికిన్.**

ఇట్లే హరిణాంగనారూప వనదేవతచేత,

## 63

**అన్యసతులయందు నాసక్తుఁ డగువానిఁ**
**దమక మొదవి కూడఁ దలచుకంటె**
**మరణమైన మేలు మది నిత్కరింపంగఁ**
**ననుచు బలుకుటయును జనవిభుండు.**

అని స్త్రీ ప్రేమస్వరూప ధర్మము నుగ్గడింప జేసినాడు పెద్దన మహాకవి. పిమ్మట నామె తన కథను వివరించి 'అనురాగవతినైన నను వరించి నాయం దపత్యంబు బడయుము దీన నీకు పుణ్యలోక సంప్రాప్తియగునన్నది. అతడామె నేకచిత్తముతోడ నంగీకరించినాడు. వీరి సంతానమే స్వారోచిషుడను ద్వితీయ మనువు. ఆయన పేరుతో వెలయునదే ఈ మను చరిత్రము. తెలుగువారున్నంత కాలము' స్థిరముగా మనుచరిత్రము 'భూసురోత్తమ ! గార్హస్థ్యమునకు సరియె' అన్నట్లు ఆశ్రమ చతుష్టయమునం దుత్తమోత్తమమయిన పవిత్ర గార్హస్థ్య ధర్మమును వస్తు వ్యంగ్యరూపమున శిరీష కుసుమపేశల సుధామయోక్తుల నుప దేశించు ఇది 'మన' చరిత్రము ! పెద్దన చతుర కవనచరిత్రము!

స్వారోచిష మనువు ప్రజలను ప్రజల ట్లరయుచు కృపామతిని పాలించుకాలమునందు,

## 64

వానలు సరణితో వర్షించె, సస్యముల్
వేళ్ళఁ గొల్పఁగ పిట్టవీఁగి పండె
నారోగ్య పుత్ర పౌత్రై శ్వర్యవంతులై
బ్రదికిరి నూఱేండ్లు పంచజనులు
పూవుఁబోఁడులు పతిదేవతలై రగ్ని
భయ తస్కర వ్యాధి భయము లడఁగె
ఫలపయః కుసుమాది బహుపదార్థంబులు
రసగంధ సామగ్రి నెసక మెసఁగె.
నిత్యవసదవ మృత్యు రాహిత్య యుక్తి
ధరఁ బ్రజావృద్ధి తామరతంపమయ్యె
న్యాయపథమున స్వారోచిషాఖ్య మనువు
శ్రీలఁ బెంపొంది పాలించు కాలమునను.

ఆ మనువు పాలించు కాలముననే కాదు. ఆ మనువు చరిత్రమయిన ఈః మనుచరిత్రమును వ్రాయించిన శ్రీ కృష్ణదేవరాయలు పాలించుకాలమునందును

## 65

తోలగెను ధూమకేతు శోభ జనులకు
నతివృష్టి దోషభయంబు వాసెఁ
గంటకాగమ భీతి గడచె నుద్ధతభూమి
భృత్కటకం బెల్ల నెత్తువడియె
మాసె నఘస్ఫూర్తి మరుభూములందున
నెల మూఁడు వానలు నిండఁ గురిసె
నాబాలగోపాల మఖిల సద్ద్విజమును
నానందమున మన్కి నతిశయిల్లెఁ
బ్రజలకెల్లను గడు రామరాజ్యమయ్యెఁ
జారుసత్త్వాఢ్యుఁ డీశ్వర నారసింహ

భూవిభుని కృష్ణరాయఁ డభ్యుదయ మొంది
పెంపుమీఱఁగఁ ధాత్రిఁ బాలింపుచుండ.

నాటివలెనే దేశము సుభిక్షముగా నుండినట్లు పెద్దనార్యులు వక్కాణించిరి. నేటి సంగతి నేను చెప్పనక్కఱలేదు. వర్ష సస్యారోగ్యైశ్వర్యముల మాట యెట్లున్నను పుత్రపౌత్రాభివృద్ధికిని, అగ్నిభయ తస్కర వ్యాధి భయములకు నేడు లోటులేదు. ఈత్యుపద్రవమెట్లున్నను నీత్యుపద్రవము లేకపోలేదు. కావున రాయల కాలమునందుండిన 'రామరాజ్యమును' కోరుకొందము. తక్కిన ధన ధాన్యాదులను గూర్చి తటపటలాడ పనిలేదు.

## 66

కోరిక నీ స్వారోచిషు
చారిత్రము వినిన వ్రాయఁ జదివిన ధనధా
న్యారోగ్య పుత్రవంతులు
నై రూఢిగఁ గంద్రు పిదప నమరత్వంబున్.

అను మహాకవి ఆశీస్సు మనకు శ్రీరామరక్ష కావున మనము మను చరిత్రమును విందము, ఇతరులకు వినిపింతము. మనుచరిత్రమును గూర్చి వ్రాయుదము, ఇతరులచే వ్రాయింతము. మనుచరిత్రమును చదువుదము, ఇత రులచే చదివింతము. ఈ పని మనము చేసిన చాలును. "దైవంబటమీఁద మేలు తాన ఘటించున్".

మిత్రులు యువభారతి కార్యకర్తలు మనుచరిత్రమును గూర్చి నాచే కొంత వ్రాయించినారు. వారికి దైవము మేలు ఘటించుగాక ! మీకొఱకు వారు నాచే ఇది వ్రాయించినారు. మీరు దీనిని వినుడు, చదువుడు, దీనిని గూర్చి వ్రాయుడు. వ్రాసిన నాకును, విన్న, చదివిన మీకును దైవము మేలు చేకూర్చు గాక !

—:o:—



# యువభారతి
## సాహిత్య సమావేశాలు

సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతర సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో గడచిన పదహారు సంవత్సరాలుగా కృషి చేస్తున్న సంస్థ 'యువభారతి'. మనిషిలో అంతర్లీనంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కావడానికి యువభారతి ప్రతీ నెల మొదటి, మూడు ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో సాయంత్రం 5 నుంచి 8 గంటల వరకూ సాహితీ సమావేశాలు నిర్వహిస్తున్నది. ఈ సమావేశాలకు సహృదయులందరూ ఆహ్వానితులే!

**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3